# ఓం
# శ్రీ శివరామ దీక్షిత అచల గురు సాంప్రదాయము





## "ఆత్మ జ్ఞానోపదేశము"
## (ప్రథమ సోపానము)

(కంద పద్యములు, తాత్పర్య సహితము)

మరియు

## "అచల తత్వములు"

**రచయిత:**

శ్రీ అచల గురు నిజానంద జగతయార్యులు వారి శిష్యుడు

**శ్రీ సదా కరుణానంద సంతోషాచల రాజయోగి (శేరిలింగంపల్లి),**

రంగారెడ్డిజిల్లా, తెలంగాణరాష్ట్రం.

## (i)
## ***నా ఆధ్యాత్మిక జీవన పరిచయము***

గురు స్వరూపులారా! నేనను కలలో గలిగిన మద్గురు నిజానంద జగతయార్యుల పాద పద్మములంది సదా కరుణానందుడు అను సంతోష రాజయోగియనంబరగు ఈ లేని నేను మొదటగా త్రివిధ ధర్మముల విచారణ జేసి జనన మరణముల విషయముల తెలుసుకొనవలెనని నిజానంద జగతయార్యుల గారి వద్ద 1999 వ సంవత్సరము వైశాఖ మాస పౌర్ణమి నాడు మంత్రోపదేశమంది, ఆయనగారి అనుమతితో కొంత కాలము అనగా 2004 సంవత్సరము నుండి ఇంకా ఇతర గురువులను విశ్లేషించి తెలుసుకొనెదనని పరివేద అనంత రెడ్డార్యులను చేరవలసి వచ్చినది (ఈయన వద్దకు వెళ్ళుటకు ఒక కారణము ఉన్నది అది ఏమంటే ఆయన పరివేద గ్రామము మీద తత్వములు ఏదో వ్రాసియున్నారు అందులో మా పరమ గురువులు శ్రీ నిర్భయానంద బుచ్చయార్యులు గారి చిత్ర పటమును నాకు తెలిసిన వారి వద్ద చూసియున్నాను.. అయితే మా తండ్రి గారు/ మరియు మా గురువు గారు అయినటువంటి నిజానంద జగతయార్యులు గారు బోధించిన విషయములనే ఆయన గారు బోధించారు. ఇక అలా కొద్దీ కాలము తరువాత అనంత రెడ్డార్యులు గారు సౌమ్య శీలురు, మృదు స్వభావి అయినటువంటి అచల గురు శ్రీ కంద్యానం సుదర్శనాచల రాజయోగి నర్సప్ప గూడెం, రంగారెడ్డి జిల్లా గారితో బోధనా తరగతులు నిర్వహించగా... అక్కడ సుదర్శనాచల రాజయోగి గారితో పరిచయము నాకు ఎంతో మోదము కలిగినది, తదుపరి ఆయనను ప్రబోధను తెలియ గోరగా ఆయన నా స్థితిని గ్రహించి నాకు కొన్ని విషయములను

తెలిపియున్నారు. ఆ తదుపరి అచల రాజయోగి, మహోన్నతమగు అచల బోధకులు నా ఈ జీవితములో మహదానంద క్షణములను అందించిన మహోన్నత మూర్తి మా పరంపర వాసులు నిజ ప్రబోధ నొసగిన సమిష్టి బోధానంద ఉప్పలంచి కృష్ణమూర్తి షోడశీ విలక్షణ స్వాములు.

సీతాఫల్మండికి మా నాన్న గారు నన్ను తరచూ అప్పట్లో అనగా 1996 ఆ సమయములో తీసుకెళ్లి ఆయన దర్శనము చేయించి మందిర ప్రచురిత పుస్తకములు కొని ఇచ్చేవారు, ఎందుకంటే మా నాన్న గారికి తెలుసు నాకు ఆధ్యాత్మిక గ్రంథములను బాగా చదవటం అలవాటు అని. తరువాత నా చదువు ప్రభావమున అక్కడికి వెళ్ళటం మాని వేసాను. ఆ తరువాత మా తండ్రిగారు/గురువు గారు అయినటువంటి నిజానందులు సెప్టెంబర్ 29 2007న బయలైనారు. అయితే నేను పరివేద అనంతార్యుల వారితోనూ సుదర్శనాచల రాజయోగితోనూ, కృష్ణ మూర్తి నాయన గారితోనూ, ఏక కాలములో అనుభవమును పొందటం జరిగింది అంటే ఈ నా ఆధ్యాత్మిక ప్రయాణం నా తండ్రి గారితో గురూపదేశము 1999 తో మొదలై 2004 అనంతార్యులు గారితో గడుస్తున్న కాలములోనే కృష్ణ మూర్తి నాయన గారితో నాన్న గారు ఐక్యం అయిన తరువాత 2010 సంవత్సరము నుండి దగ్గరవ్వటం ప్రారంభించాను. సీత ఫల్ మండి గురుమందిరం లో తరగతులు 2011 నుండి అప్పుడప్పుడు వీలును బట్టి వెళ్ళేవాడిని కానీ నాన్న గారు బయలైన తరువాత ఉద్యోగము నాకు రావటం వలన సమయం సరిపోక నేను ఫలానా అని కృష్ణ మూర్తి నాయన గారితో కొంత కాలము గుర్తు చేయలేదు. అయితే నేను ప్రబోధ నిమిత్తమై శ్రీ కృష్ణ మూర్తి

నాయన గారిని 2018 లో కోరగా మా నాన్న గారు నిజానందులు ఏనాడో చేసిన చిన్నప్పటి పరిచయము నన్ను గుర్తు పట్టి ఆయన దానికేమున్నదిరా నీవు సూక్ష్మ జ్ఞానివి నీవంటి వారికి చెప్పుడము శ్రేయోదాయకమే బిడ్డ, నీవు 28.06.2018 పౌర్ణమి న వచ్చినచో అటులనే ప్రబోధ గావించెదనని తెలిపి అట్టి మాట ప్రకారము ప్రబోధను చేసినారు. అట్టి ప్రబోధకు సంబంధించిన ఫోటోలు కూడా ఈ గ్రంథమున పొందు పరచనైనది. ఆ తరువాత 2020 ఫిబ్రవరి 1 వ తేదీన కృష్ణమూర్తి నాయన గారు బయలైనారు. తదనంతరం ఇంకా విషయములను తెలుసుకొనుటకై మరొక సారి మా మా పరంపర వాసులు అఖిల భారత అచల గురు సేవా సమాఖ్య అధ్యక్షులు మరియు శ్రీ అచల గురు బోధ వాచస్పతి గాన గంధర్వ బిరుదాంకితులు అయినటువంటి నాగుల వెంకటేషం ఆర్యులు గారిని సందేహ నివృత్తులను గోరగా నాకు గురు గీతను నిదర్శనముగా చూపి గురుగీత 77 శ్లో. **"మధులుబ్ధో యథా భృంగః| పుష్పాత్ పుష్పాంతరం వ్రజేత్| జ్ఞానలుబ్ధ స్తథా శిష్యో| గురోర్గుర్వంతరం వ్రజేత్||** అని వాఖ్యమున్నది నాయన మీ తండ్రి గారితో మొదలై ఇంత మంది వద్ద నీవు గైకొనిన అనుభవము పై గురు గీత శ్లోకమును జ్ఞప్తికి తెచ్చుచున్నది, అని నుడివినారు. ఆయన వద్దను సందేహ నివృత్తులను చేసుకొంటిని.

ఇప్పుడు ఇలా ఈ చిన్ని గ్రంథము ముముక్షువులగు అప్పుడప్పుడే ముక్కు పచ్చలారని పసి కందులగు గురు బిడ్డలైన సర్వులకు కొంత ఆత్మ జ్ఞానము ఈయ గలదని భావిస్తూ... గురు శిష్య సంభాషణముగా కంద

పద్యములను జేసి వాటికి తాత్పర్యమును కూడా జత జేసి అలాగే అచల తత్వములను కూడా భజన నిమిత్తమై ఇందు పొందు పరచనైనది. ఇంకా తత్సంబంధమైన ఆత్మ జ్ఞాన సంబంధములగు కొన్ని వాక్యములను సేకరించి వాటిని విశ్లేషించి ఈ గ్రంథమును మీ ముందు ఉంచనైనది కావున ముముక్షువులకు ఇది ప్రథమ సోపానముగా ఉపయోగపడునని తలంచి సద్గురు ఆశీర్వచనములతో....

**గ్రంథ కర్త/ సద్గురు చరణ ధూళి:**
**శ్రీ సదా కరుణానంద సంతోషాచల రాజయోగి**

***శ్రీ మదశరీర నిజ గురు పరంపర ధ్యాన్నం***

||శ్లో|| గురుబ్రహ్మ గురువిష్ణు| గురుదేవో మహేశ్వరా|
గురుసాక్షాత్ పరబ్రహ్మ |తస్మై శ్రీ గురవేనమః||

||శ్లో|| ఓం నమో బ్రహ్మాధిబ్యో బ్రహ్మవిద్యా సాంప్రదాయ కర్తృభ్యో|
వంశఋషిభ్యో మహాద్భ్యో నమోగురుభ్యః||

||శ్లో|| సర్వో పప్లవ రహిత ||ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో|
బ్రహ్మైవాహమస్మి |అహం పదార్థ రహితః||

||శ్లో|| శ్రీ బ్రహ్మ విద్యా గురు విష్ణు సూర్యం| శ్రీ యాజ్ఞవల్క్యం
జనకం|శుకంచ సాందీప మీశం|కృష్ణార్జున యుద్ధవం|
వందే గురున్మే గురు పాదుకాంతాం||

||శ్లో|| అంబికా శివయోగీశం |వేమనయోగి సద్గురుం|
నిరంజన వెంకయార్యం|తిరు వెంగళ గురుంభజే||

||శ్లో|| శ్రీధర స్వామినం నిత్యం |బోధ కారణమవ్యయం|
భావాతీతం మహంవందే సుఖజ్ఞానైక నిర్మలం||

||శ్లో|| వందారు జన మందారం| వందేహం తన్నిరంతరం|
రామడుగు వంశజం శుద్ధం |శివరామాఖ్యదీక్షితం||

||శ్లో|| యస్యబోధో దయాత్సర్వం బ్రహ్మవేత్తే వగమ్యతే|
శివరామే విధిఖ్యాతం|త ద్దైవత ముపాస్మహే||

||శ్లో|| కామాధిరిపు హంతారం| కారుణ్యా మృత సాగరం|
మత్కంబాలూరిఅప్పబ్రహ్మం|సద్గురుభ్యోనమోనమః||

||శ్లో|| శ్రీ మత్పరశురామాన్వయాబ్ధి |చంద్ర మనోరమం|
నిత్యానందం మహం వందే |సీతారామ గురుంపరం||

||శ్లో|| నిత్యం సాంద్ర కృపార సంవిధిత భావాభావమత్యున్నతం
ద్వంద్వా తీతం మత్పరం పరమకళ్యాణాత్మ తత్వం విదుం|
బ్రహ్మానంద మయం సుబోధ నిలయం స్వానంద భావం
సదా| శ్రీమద్భాగవతాన్వయాబ్ధి విలసత్ శ్రీ కృష్ణ చంద్రంభజే||

||శ్లో|| శ్రీ వత్సగోత్ర కళాశాంబుధి పూర్ణచంద్రం|
శ్రీ కృష్ణ పాదకమలామృత పానభృంగం|
శ్రీ ఫీల్ఖాన వంశాంబుధి రేవజాతం|
శ్రీ లక్ష్మణార్యమనసా స్వగురుం భజామ్యహం||

||శ్లో|| శ్రీ సనాతనగోత్ర కళాశాంబుధి పూర్ణచంద్రం|
శ్రీ లక్ష్మణ గురుపాద కమలామృత పానభృంగం|
శ్రీ విశ్వకర్మ కులదీప శాంత దయాసముద్రం|
శ్రీ కొండోజు సీతయార్య మనసా స్వగురుం భజామ్యహం||

||శ్లో|| శ్రీ కొండోజు సీతయార్య పాద సేవా ధురంధరం|
గుహ్యాత్గుహ్య పరమ గుహ్యలభ్యం|
శ్రీ నాగుల రామ లింగార్యంగురుంభజే||

||శ్లో|| శ్రీ నాగులరామలింగార్యచరణ సేవా ధురంధరం|
బృహద్వాశిష్టసద్విచారసాధుమార్గవర్తనం|
ఆశ్రిత భక్తజన కోటి సంశయార్తినివర్తనం|
శ్రీ నిర్భయానంద బుచ్చయార్యంగురుంభజే||

||శ్లో|| నిర్భయానందగురోర్శిష్యం|నిజానందసునిర్మలం|
శ్రీ బుచ్చయార్య దేశికేంద్ర కారణం|
శ్రీ సావిత్రీ సమేత జగతయార్యం గురుంభజే||

||శ్లో|| అశరీర నిజ గురు సాంప్రదాయ వర్తనం|
శ్రీ నిజానంద జగతయార్య చరణ సేవితం|
బహుఘన అచల సాధుజన అనుభవ గ్రోలితం|
శ్రీ మణీలా సమేత సదా కరుణానంద సంతోషార్యం గురుంభజే||

||శ్లో|| అస్మద్గురు సమారంభాం |కృష్ణసాందీపమధ్యమాం|
మహావిష్ణుపర్యంతాం| వందేగురుపరంపరాం||

*లఘుపూజా*

||శ్లో|| బ్రహ్మానందం పరమసుఖదం|కేవలంజ్ఞాన మూర్తిం|
ద్వంద్వాతీతం గగనసదృశం|తత్వ మస్యాది లక్ష్యం|
ఏకంనిత్యం విమల మచలం|సర్వ ధీసాక్షి భూతం|
భావాతీతం త్రిగుణరహితం|సద్గురుం తంనమామి||

||శ్లో|| ధ్యాన్నమావాహనం| సింహాసనం పాద్యంతద్వైవచ|
అర్ఘ్యం ఆచనీయంచ స్నానం|పంచామృతైస్సహ||

||శ్లో|| శుద్ధోదకం వస్త్ర యుగ్మం|యజ్ఞసూత్రం విభూషణం|
విలేపనం అక్షితాంచ|పుష్పం స్వర్ణ వినిర్మితం||

||శ్లో|| ధూపం ధీపంచ నైవేద్యం |పానీయం ఫలమేవచ|
తాంబూలం దక్షిణార్ధిఖ్యం|మంత్ర పుష్పం ప్రదక్షిణం||

||శ్లో|| నమస్కారం దేశికేంద్రం మయాతుభ్యం నివేదయేత్|
కృపయా గృహ్యతాం స్వామిన్న్యూనాధిఖ్యం న చింతయా||

||శ్లో|| లఘుపూజా విధిం భాగవత కృష్ణ ద్విజన్మనా|
రచితం శ్రోత్రువక్తృణాం| మిదంమోక్షకరంపదం||

~~~ *శ్రీ సద్గురు ప్రభు మహరాజ్కిజై * ~~~
~~~



శ్రీధరులు శివరామ ధీక్షితాచల గురు జండాను పై కెత్తుమన్నా।
ఈ ధరను లోకాన భవ రోగమును బాపుధీరైన బోధలేదన్న।
||శ్రీధరులు||

ఆది మధ్యాంతమను మాటయే లేదంచు ఎలుగెత్తి చాటరోయన్న।
వాదా బేధా రహిత సకలమత సమ్మతము సాధితంబిదిదెలియరన్న
||శ్రీధరులు||

అశరీర గురు పథము ద్వయ దోశ నాశము ఆనంద రహితమోయన్న।
దోశమను సుజ్ఞానమనుసత్త లేదెపుడు।నిరావరణ మచల మిదిరన్న
||శ్రీధరులు||

జీవేశులను భావ మూలమెన్నగ దాని మూలమేమియు లేదురన్న।
యీ ఉత్త బట్టబయలందునా ఉదయంబు వట్టిమాటని దెల్యరన్న
||శ్రీధరులు||

భవబంధమను భ్రాంతి బాపేటి శివరామ ధీక్షితాచల పీఠమన్నా।
అవనిలో తత్పీఠ మార్గాణుసారులు బుచ్చయ్య దేశికులురన్న
||శ్రీధరులు||

ధరణి లింగంపల్లి కౌండిన్య గోత్రులు జగతయ్య రాజయోగన్న।
పరమగురు మార్గాను సారులై యీ ధరను సంతోషనేలె వినరన్న
||శ్రీధరులు||

## సీస పద్య మాలిక

సీ. శ్రీ పరాత్పరగురు| శ్రిత జన పరిపాల|
భక్త జనపోషకా |భవ వినాశ|
లోకాలనేలేటిలీల| లోచనమాకు|
సద్గతిని జూపుమా | సత్య ఫాల|
కరుణించి కాపాడు | కమల లోచన మమ్ము|
జీవేషులనె దోశ| జనువు బాపు|
నీ పథమె నమ్మితిమి |నిక్కముగ మదిలోన|
నిజ నిర్ణయోద్ధార | నిఖిల మీవె|

తే.గీ. పుట్టు చావులును | లేనట్టి పథము ఏదొ|
తెలియ జెప్పండి గురుదేవ | తేట గాను|
ధర నిజానంద జగతయ్య | ధాత గురుడు|
కరుణ నొసగియు సంతోషు | కర్మ బాపె||

సీ. తన్నుతాతరియించు | తపమెన్నువాడెవడొ|
మరుజన్మలేనట్టి| మర్మమెరుగు|
తన్నుతా తరియించు| తపము జేయనివాడు|
నరుడు గాడతడిందు| నక్కయేను|
రాజబాటయు జూపి| రక్షించు వారెవరొ|
అతడె దైవ మటంచు| నర్థమెరుగు|
నిజ గురోత్తము గని| నిజమెరింగిన చాలు|
భవబాధ లేదపుడు | పరము నదియె|

తే.గీ. కానతక్షణమె సద్గురుని కరుణపొంది|
జనన మరణంబులను బాపి|జయము జేయు|
ధర నిజానంద జగతయ్య | ధాత గురుడు|
కరుణ నొసగియు సంతోషు | కర్మబాపె||

సీ.వేదాంత సారంబు వెదకి జూచిన గాని|
నిజము దెలియఁగ లేవు నియతి లేక|
భాగవత కథలెల్ల భక్తిగా జదివేరు|
నిజము దెలియఁగ లేవు నియతి లేక|
నామ రూప క్రియల నటనలన్నియు నమ్మి|
నిత్యమవి గావంచు నిజము గనరు|
నిఖిల దేవతలెల్ల నిత్యమని దలచేరు|
నిజము దెలియఁగ లేవు నియతి లేక|

తే.గీ. నిజము పూజితుండు గురుఁడు నిఖిల మతడు|
అచల యోగుండు నిలలోన నమల గురుడు|
ధర నిజానంద జగతయ్య ధాత గురుడు|
కరుణనొసగియుసంతోషు | కర్మబాపె||

సీ. ఎవడెన్ని రూపాల ఎంచి కొలిచిన గాని|
గురుపాద మందకా గురియె గనడు|
జపతప యాగాలు జాతరలు దిరిగినా|
కడుపాప పంకంబు కడుగబోవు|
భీజమందంకురము బిందువందీ జగము|
గురుపాద మందకా|నెరుగబడడు|
దేహి దేహములంచు| ద్వయ దోషములెన్న|
గురుపాద మందకా|నెరుగబడడు|

తే.గీ. నిజము పూజితుండు గురుఁడు నిఖిల మతడు|
కాన తక్షణమె సద్గురుని కరుణ బొందు|
ధర నిజానంద జగతయ్య | ధాత గురుడు|
కరుణ నొసగియు సంతోషు | కర్మ బాపె||

సీ. శిలలందు గనెదవు సిగ్గు మాలిన జన్మ|
శిల్పుడేమనెను నీ శీలమేది|
దేవ దేవుడటంచు దేవులాడెదవింక|
వేదశాస్త్రంబులా వెదుకబోవు|
ఎంత దూరమైనా నీ| వెగసి బోదువు గాని|
దరినున్న సాధులా దరికి రావు|
కృష్ణుని పూజించి తృష్ణల గోరేవు|
నతడు జెప్పిన బోధనడుగరావు|

తే.గీ. ఈ వివేకంబు నీ జన్మమింక రాదు|
కాన తక్షణమె సద్గురుని కరుణబొందు|
ధర నిజానంద జగతయ్య ధాత గురుడు|
కరుణ నొసగియు సంతోషు కర్మ బాపె||

సీ. గురుబోధకులగన్న|గురుపుత్రుల గన్న|
ఓర్వంగ లేరయా| ఓగు వారు|
గురువులంటే నేమి|గుర్తులేయుండెను|
బతికి సచ్చిరంచు పలుకు జనులు|
తామెరిగె దేవతల|తావు జూపగ లేరు|
బతికి చావగలేర|బలుక రండి|
గురుడంటె దేవతల|గురిగ నిలచినాడు|
గురుని పొందనివాడు గుణియె గనడు|

తే.గీ. ఈ వివేకంబు నీ జన్మమింక రాదు|
కాన తక్షణమె సద్గురుని కరుణబొందు|
ధర నిజానంద జగతయ్య ధాత గురుడు|
కరుణ నొసగియు సంతోషు కర్మ బాపె||

## గురు శిష్య సంభాషణము

**కం.** మద్గురు దేవుండొసగిన|
సద్గతి భవరహిత బోధ సత్పథమిదియున్|
తద్గతి కొరకై చదువుడి|
సద్గుణ సంపన్నులారా సజ్జనులారా||

**తాత్పర్యము:** మంచి ప్రవర్తనే సంపదగా గలవారా, నా గురుదేవులు చూపిన భవ రహితమునగు ఈ బోధ ఉన్నత స్థానమునగు మంచి మార్గము. అటువంటి స్థానమును పొందుట కొరకు ఈ గ్రంథమును చదవండి.

**కం.** జననము మరణము దెలియక|
మననము జేయుచు నొకండు మంతనమంచున్|
తన సంశయ మిడచుటకే|
చను దెంచెను గురుపథంబు చతురుమలారా||

**తాత్పర్యము:** ఓ నేర్పరి తనము గలవారా, ఒకడు జనన మరణములను దెలియక సంశయాత్మకుడై ఆ సంశయ నివృత్తికిగానూ, బహు చింతన జేయుచు గురుని వెదకుచు గురుని మార్గమును పయనమైనాడు.

**కం.** కనినాడతండు గురునిన్|
మనమున బహు సంతసించె మహిమనుకొనుచున్|
అనఘము గురుడితడన్కొనె|
అనుకరణీయం బటంచు అరుణుల్లారా||

**తాత్పర్యము:** ఓ జ్ఞాన స్వరూపులారా, ఆ విధంగా వెదుకగా అతనికి గురుదర్శన భాగ్యము కలిగింది. ఆ గురువు గారిని చూచి చాలా సంతోషపడి నిర్మలమైనటువంటి బోధకుడు ఈతడే యని మరియు అనుకరించవలసిన గురుడనుకొనినాడు.

**కం.** అతడు గురుపుత్రుల నడిగె|
సతతము గురుభక్తి వారి సరణిని గనుచున్|
హితమును జేయుడి నాకని|
సతతము గురు పాదసేవ సిద్ధించుటకున్||

**తాత్పర్యము:** ఎల్లప్పుడు ఆ గురువు గారి పాదసేవకు సంసిద్ధుడై అతడు ఆ గురువు గారి శిష్యులను, వారి గురు భక్తిని గని అతనిని కూడా వారితో చేర్చుకొని గురువుగారి పాదముల వద్దకు తీసుకు వెల్లమని అడిగినాడు.

**కం.** అంతట వారంత గురుని|
చెంతకు గొని పోయినారు చింతగు నతనిన్|
అంతలో గురుడానతిచ్చె|
సంతస పడి నాడతండు సాగిల బడియెన్||

**తాత్పర్యము:** ఆవిధంగా అతని చింతను దెలసి గురువు గారి చెంతకు తీసుకొని పొయినారు. గురువు గారు అటులనే కానిమ్ము అని అనుగ్రహించగా అతడు సంతోషపడి గురువు గారి పాద పద్మముల సాష్టాంగ నమస్కారము చేసినాడు.

**కం.** ఏ కారణంబు నీవిట|
మాకాడికి వచ్చి ఏమి చేకొన దలచే|
ఆ కారణంబు దెలుపుమి|
నీకే సంశయములున్న నిరతిగ నీవున్||

**తాత్పర్యము:** ఏకారణము వలన నీవు మా వద్దకు వచ్చినావు. ఏమి పొంద దలచినావు? ఆ కారణము ఏదో చెప్పుము. నీకు ఏ సంశయములున్నను ఆశక్తి యుండి అడుగుము అన్నాడు గురువు గారు.

**కం.** నను తరియింప జేసెడి|
ఘన తరమగు బోధ జేయు ఘనులిల మీరున్|
యని వచ్చితి మీ కడకున్|
కని జేయుదు మీదు సేవ కర్మము బాయున్ ||

**తాత్పర్యము:** నన్ను ఈ జనన మరణములను బ్రాంతి నుండి దాటింప ఉత్తమోత్తములు, వేదాంత వేద్యులు, అతీత భావజ్ఞులు మీరు, అందు చేతనె మీ వద్దకు వచ్చియున్నాను. నిజమైన ఈ నా జన్మమను ఈ కర్మమును తొలగించకొనువాడనౌదును.

||గురువు||

**కం.** కతము గల వాడితండని|
యతనికి గలభక్తి మెచ్చి యరమర లేకా|
మతి గలుగ జేతునని గురు|
సతమును నందింప జేసె సరణిగనపుడున్||

**తాత్పర్యము:** అతని భక్తి యందు కూడా గురునికి ఎట్టి సందేహము లేక జనన మరణములనే సంశయము పట్టుకొని ఇక్కడికి వచ్చినాడని యోచించి ఆతని ఈప్సితార్థము గ్రహించి, నిత్యా నిత్య వివేకము గలిగించి, శాశ్వతమునగు పరమపథ (జన్మరాహిత్యస్థితిని) మార్గమును బోధించ దలచినాడు.

అతడు:

**కం:** గురవే శరణము జేసెద|
కరుణతో నుపదేశ మిచ్చి కావవె నన్నున్|
ఇరవారు పదంబు జూపుడి|
సరణివి నీవే నటంచు సాగిల బడితిన్||

**తాత్పర్యము:** గురువరా... మీకు మ్రొక్కుచున్నాడను దయయుంచి నాకు ఉపదేశమొసంగి నాకు స్థిర పదవిని చూపండి, నాకు నీవే దారివైయున్నావు. మీకు సాష్టాంగ నమస్కారములు తండ్రి.

||గురువు|| తదాస్తు, నీ భక్తి ప్రపత్తులకు నాకు బహు సంతోషముగా నున్నది నాయన, నీవు శాస్త్రోక్తముగా రేపు ఉదయమున బ్రహ్మ ముహూర్తకాలమున లేచి కాల కృత్యములు తీర్చుకొని స్నానము జేసి శుభ్ర వస్త్రములు ధరించి ఉపదేశమునకు సంసిద్ధుడవు కమ్ము.

మరునాడు ఆ శిష్యుడు గురువు గారి ఆజ్ఞ మేరకు బ్రహ్మ ముహూర్త కాలమున గురువు గారి సమక్షమునకు చేరుకున్నాడు. ఆ సంధర్భమున గురువు గారు అనుష్ఠానమును పూర్తి గావించుకొని అటు దూరంగా కూర్చున్న అతన్ని పిలచి, బిడ్డా నేను చెప్ప బోవునది శ్రద్ధగా వినుము నీవు పరమ పవిత్రుడవు, పూర్వ జన్మ సుకృతము చేతనే జనన మరణములను భ్రాంతి తీర్చుకొనుటకు ఇంతగా విల విల బోవుచున్నావు. నీవంటి వారే కదా, ఇటువంటి భవసాగరమును దాటుటకు అర్హులై ఉన్నారు. నీ వంటి వారికే ఈ బోధను ఉపదేశించుటకు సాధ్యపడుతుంది..

అని గురువు గారు గురూపదేశంబు నీయ నుపక్రమించి అతనిని దగ్గరకు తీసుకొని నుదుట విభూదిని పూసి బ్రహ్మ రాత అనే తనలో ఉన్న భ్రాంతిని తీసినట్లుగా తిరిగి ఆ విభూదిని తుడచి మంత్రోపదేశము చేసి తను మన ధనములను అర్పించ అతనిచే ప్రమాణము గావించి త్రివిధధీక్షలను తెలిపి అతనిని కరుణతో చూచి ఆ గురువు గారు ఇలా చెప్పుచున్నారు.

బిడ్డా, ముందుగా నీ యందు గల భక్తిని, సాధనా శక్తిని నీవు పరిశీలించుకొనుము. దానికి సంబందించిన వాటిని నేను ఇపుడు నీకు తెలుపబోవుచున్నాను, కావున నీవు స్థిర చిత్తుడవై వినుము అనగానే...

||శిష్యుడు||అలాగే గురువర్యా, ఆనతీయండి మీ కృపకు పాత్రుడను.

||గురువు|| పూర్వ జన్మ సుకృతముచే చీమకైన హాని చేయలేని సున్నిత మనస్కుడు సత్వగుణ సంపన్నుడు అయినటువంటి మానవుడు ఈ సకల జీవకోటికి ఆధారము... సర్వ లోక పాలకుడైన ఆ భగవంతుడేనని ఆయన మాయ చేతనే ఈ జన్మమని దుష్ట శిక్షణ, శిష్ట రక్షణాయుతుడు ఆ భగవంతుడని మిక్కిలి పవిత్రమైన ప్రేమ భావనయే భక్తి. ఈ భక్తి విషయమై శ్రీ భగవానులు కృష్ణ స్వామి భగవద్గీత 12 వ అధ్యాయమున ఇరువది శ్లోకములు ఖచ్చితముగా విచారణ చేయదగినవి.

భక్తుడు అయిన వాడు ఎలా ఉండాలో స్పష్టంగా తెలిపినారు. ఒకసారి అట్టి విషయమును చెప్పు బోవుచున్నాను బాగ స్థిర మనస్కుడవై పరిశీలనతో విను నాయన.

## <u>భగవద్గీత ద్వాదశోధ్యాయం (భక్తియోగము)</u>

||శ్లో|| ఏవం సతత యుక్తాయే భక్తాస్త్వాం పర్యుపాసతే|
యే చాప్యక్షర మవ్యక్తం తేషాంకే యోగవిత్తమాః||

**అర్జునుడు పలికెను:** శ్రీ కృష్ణ, మహా భక్తితో నిరంతరము నిన్నే భజిస్తూ, ధ్యానిస్తూ పరంధాముడవైన నీ సుందర రూపమును ఆరాధించే వారూ, ఇంకా ఇంద్రియ గోచరము కానీ అక్షర పరబ్రహ్మను ధ్యానించు వారు ఉంటారు.. అందులో అనగా వారిరువురిలో ఉత్తమమైన యోగి ఎవరు?

**భగవానువాచ:**

||శ్లో||మయ్యావేశ్య మానోయేమాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః||

శ్రీ భగవానుడు పలికెను: పరమేశ్వరుడైన నా యందు ఏకాగ్రతను నిలిపి నిత్యమూ నా భజన ధ్యానములతో గడుపుతారో, ఆరాధిస్తారో అట్టి వారు శ్రేష్ఠులు.

||శ్లో|| యేత్వక్షరమనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే|
సర్వత్ర గమ చింత్యంచ కూటస్థ మచలం ధ్రువం||

||శ్లో|| సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమ బుద్ధయః|
తేప్రాప్నువంతి మామేవ సర్వ భూతహితే రతాః||

**తాత్పర్యము:** ఎవ్వరైతే ఇంద్రియాలన్ని నిగ్రహించి సకల భూతముల హితము కోరుతాడో, సకల ప్రాణులనూ సమానంగా చూస్తాడో ఆతడే యోగి. నిర్దేశింపశక్యంగానిదీ, ఇంద్రియములకుకనిపించనిది, చలించనిదీ, నిత్యమైనది అయిన అక్షర పరబ్రహ్మమును ఎవరు ధ్యానిస్తున్నారో అట్టి వారు నన్ను పొందుతున్నారు.

||శ్లో||క్లేశో అధిక తర స్తేషా మవ్యక్తాసక్త చేతసాం|
అవ్యక్తాహి గతి ర్దుఃఖం దేహవద్భి ర వాప్యతే||

**తాత్పర్యము:** అక్షర బ్రహ్మ చింతనము అతికష్టమైనది. దేహాభిమానులకు అవ్యక్త పరబ్రహ్మ ప్రాప్తి అతి కష్టముగా పొందబడుచున్నది.

||శ్లో|| యేతుసర్వాణికర్మాణిమయిసన్న్యస్యమత్పరాః|
అనన్యేనైవయోగేనమాంధ్యాయంతఉపాసతే||

||శ్లో|| తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్|
భవామి న చిరాత్పార్థమ య్యావేశితచేతసాం||

**తాత్పర్యము:** ఓ అర్జునా, ఎవరు సమస్త కర్మలను నా యందు సమర్పిస్తారో, నన్నే పరమగతిగా తలుస్తారో, నన్నే ధ్యానిస్తూ ఉపాసిస్తారో, అట్టి వారిని జనన మరణ ప్రవాహ రూప సంసార సముద్రము నుంచి శీఘ్రముగా ఉద్ధరిస్తున్నాను.

||శ్లో|| మయ్యేవ మన ఆధస్త్వ మయి బుద్ధిం నివేశయః|
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వంన సంశయః||

**తాత్పర్యము**: అర్జునా! నా యందే మనస్సును స్థిరముగా నిలిపి, బుద్ధిని నా యందే ఉంచిన నా యందు స్థిరముగా ఉండగలవు. ఇందు ఎట్టి సందేహము లేదు.

||శ్లో|| అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరం|
అభ్యాస యోగేన తతో మా మి చ్ఛాప్తుమ్ ధనంజయా||

**తాత్పర్యము**: ఓ అర్జునా... మనస్సును స్థిరముగా నా యందు నిల్పుటకు వీలుకానిచో అభ్యాస యోగముల ద్వారా ప్రయత్నించవచ్చును.

||శ్లో|| అభ్యాసే ప్యస మర్థోఅసి మత్కర్మపరమో భవ|
మదర్థ మాపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి||

**తాత్పర్యము**: అభ్యాసము చేయుటకు కూడా ఆశక్తుడైనచో నా నిమిత్తమైన కర్మ యందు నిరతుడవుకా. నాకై కర్మలను ఆచరించినా నీవు సిద్ధిని పొందగలవు.

||శ్లో|| అ థైతద ప్యశక్తో అసి కర్తుం మద్యోగ మాశ్రితః|
సర్వ కర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్||

**తాత్పర్యము**: నా నిమిత్తం కర్మలను ఆచరించుటకు కూడా అశక్తుడవైనచో ఆత్మ నిగ్రహం కలిగి ఉండు. నన్నే ఆశ్రయించి కర్మ ఫలాపేక్ష త్యజించి కర్మలను చేయుము.

||శ్లో||శ్రేయో హి జ్ఞానమభ్యాసాద్ జ్ఞానా ద్ధ్యానంవిశిష్యతే|
ధ్యానాత్కర్మ ఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తిరానంతరం||

**తాత్పర్యము**: అభ్యాసము కంటే జ్ఞానము శ్రేష్టము. జ్ఞానము కంటే ధ్యాన్నము ఉత్తమము. అట్లే ధ్యాన్నం కన్నా కర్మఫలత్యాగము మిక్కిలి శ్రేష్టము. త్యాగము వల్ల పరమ శాంతి లభిస్తుంది.

||శ్లో|| అద్వేష్టాసర్వభూతానాంమైత్రత్లగకరుణఏవచ|
నిర్మమో నిరహజ్కాంసమదుఃఖఃసుఖఃక్షమీ||

||శ్లో||సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా ధృఢ నిశ్చయః|మయ్యర్పిత మనోబుద్ధిర్యో మే భక్త స్సమే ప్రియః||

**తాత్పర్యము**: సకల భూతములను ద్వేషింపనివాడు, సకల ప్రాణుల యందు ప్రేమాభిమానాలు కలవాడు, మమకార అహంకారములు లేనివాడు, సుఖదుఃఖాలను సమముగా భావించువాడు, సహన శీలుడు, అన్ని వేళలా తృప్తి కలవాడు యోగి.

అతడు ఆత్మ నిగ్రహము కలవాడు. దృఢ చిత్తము కలవాడు. అటి వాడు నాకు ఇష్టుడు.

||శ్లో|| యస్మాన్నోద్విజతేలోకోలోకాన్నోద్విజతేచయః|
హర్షామర్షభయోద్వేగైముక్తోయస్సచమేప్రియః||

**తాత్పర్యము**: ఎవరి వల్ల ఎవరికి క్షోభ కలుగదో, ఎవరు ఉద్వేగమును హర్షము, ఈర్ష్యా, భయము, వికారములు లేనివాడైన, భక్తుడు, నాకు ప్రీతికలవాడు.

||శ్లో|| అనపేక్ష శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యతః|
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్త స్స మేప్రియః||

**తాత్పర్యము**:కోరికలు, కాంక్షలు లేని వాడు శరీరమును, ఇంద్రియాలను, శుచిగా ఉంచిన వాడు, పక్ష పాత రహితుడు, ఎలాంటి బాధాలకు దుఃఖము చెందని వాడు, చలించని వాడు సకల కర్మల యందు శుభాశుభ కర్మాదులను విడిచిన వాడైన భక్తుడు నాకు ప్రియుడు.

||శ్లో|| యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి|
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః||

**తాత్పర్యము**: ఎవరు ఇష్టమైన వస్తువుకి సంతోషించడో, దేని యందు ద్వేశము లేకుండా ఉంటాడో, దేనికీ శోకింపడో, అదే విధంగా దేనిని ఆశించడో, అట్టి వాడు నాకు ఇష్టుడు.

||శ్లో|| సమ శత్రౌచ మిత్రేచ తథా మనావ మానయోః|
శీతోష్ణ సుఖ దుఃఖేషు సమస్సంఘ వివర్జితః||

||శ్లో|| తుల్య నిందాస్తుతిర్మౌని సంతుష్టో యేనకేనచిత్|
అనికేతః స్థిరమతిర్భక్తిమామే ప్రియో నరః||

**తాత్పర్యము**: శత్రు మిత్రులందు, మానావ మానముల యందు, శీతోష్ణములు, సుఖములు వంటి వాటి పట్ల సమ బుద్ధి గలవాడై అన్నింటిని సమానముగా స్వీకరించు వాడు, మౌనముతో ఉండేవాడు, ఉన్నదాంతో సంతృప్తి చెందు వాడు, గృహాదుల పై ఆశక్తి లేనివాడు, నిశ్చయ బుద్ధి గలవాడు, నా యందు భక్తితో గూడిన వాడు అయిన భక్తుడు నాకు ప్రియతముడు, ఇష్టుడు.

||శ్లో|| యేతు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే|
శ్రద్ధధానా మత్పరమా భక్తస్తే అతీవ మే ప్రియాః|

**తాత్పర్యము**: ఎవరు శ్రద్ధగా ముందు చెప్పినట్టు సద్గుణవంతులై నన్నే పరమ గతిగా భావించి శ్రద్ధతో ఆచరించెదరో అట్టి భక్తులు నాకు అత్యంత ప్రియము కాగలరు.

విన్నావు కదా', శ్రీ కృష్ణ భగవానులు భక్తుడైన వాడు ఎలా ఉండాలో చెప్పిన విధమును, కావున అట్టి విషయమున ఎట్టి సందేహమునుంచక ఆయన చెప్పిన ఆ విషయములను ఆచరణలో ఉంచితివా, నీకు పరమపదమైనట్టి మార్గము సుగమము. కావున ఇప్పుడు భక్తియోగము మూడు విధములుగా భాగవతమునందు చెప్పబడినది, అట్టి విషయమును విశదముగా వివరించెద వినుము.

1. బాహ్యభక్తి, 2. అనన్యభక్తి, 3.ఏకాంతభక్తి.

**బాహ్యభక్తి**:

||శ్లో||శ్రవణం కీర్తనం విష్ణోః | స్మరణం పాద సేవనం|
అర్చనం వందనం |దాస్యం సఖ్యమాత్మ నివేదనం||

**శ్రవణము**: శ్రీమహావిష్ణువు, చరిత్రంబుల ప్రేమతో వినుట.

**కీర్తనము**: శ్రీ హరి లీలలను గానము చేస్తూ ఉండడము.

**స్మరణం**: శ్రీమహా విష్ణువు యొక్క అనంత నామమును భక్తితో స్మరియించుట.

**పాదసేవనము**: శ్రీ మన్నారాయణుని దివ్య పాద పద్మములు హృదయ మందు నిలుపుట.

**అర్చనము**: శ్రీ మహా విష్ణువును ధూప ధీప నైవేద్యములతో పూజచేయుట.

**వందనము**: శ్రీ మహా విష్ణువును వివిధములైన అనంత నామములను వాటి యందు గల అర్ధములను విచారించి మనో వందనమును చేయుట.

**దాస్యము**: శ్రీ మహా విష్ణువును యజమానిగాను ఎంచి విష్ణు దాసుడై సేవించుట.

**సఖ్యము**: శ్రీ మహా విష్ణువు యొక్క ధ్యాన్న పారాయణుడై అనన్య వృత్తితో నుండుట.

**ఆత్మనివేదనం:** అట్టి పురుషోత్తముని యందు నిశ్చల హృదయమును సమర్పించుట.

**అనన్యభక్తి:** సకల ప్రపంచము విష్ణుమయంబనియు, విష్ణువు సర్వాంతర్యామి అనియు ఆ పరంధామున్ని మించినది ఈ లోకమున ఏదియు లేదనియు దృఢమనస్కుడై ఉండుట.

**ఏకాంతభక్తి:** సకల జీవ కోటికి బాహ్యాంతరముల నిండి నిబిడీకృతంబై సకల కారకుడై యుండు విష్ణువు యొక్క మాయ చేత ఈ ప్రపంచము కలిగినది అని అట్టి పరమాత్మను జ్యోతి రూపముగా యెంచి తదేక నిష్టాగరిష్టుడై యుండుట. బిడ్డా! ఇట్టి విశయమై నీకు ఒక మాటను చెప్పదలంచితిని. అదేమనగా ఎవ్వడైనను గురు మూర్తిని చేరక ముందు పై తెలిపిన మూడు విషయములు వాడి యొక్క ఇష్ట దైవమును ఆరాధించుటకు విష్ణువైనను, శివుడైనను, బ్రహ్మ అయినను ఎవరిని పూజించు వాడైనా, ఎన్ని దేవతా రూపములను సేవించినా ఈమూడు విధములుగా చెప్పబడినవి. అయితే గురుమూర్తిని చేరిన పిదప వాడు అప్పటి వరకు సేవించిన ఆదైవము స్థానములో గురుమూర్తిని సేవించవలెను. కానీ అన్య దేవతారాధన చేయరాదు, అని తెలియుము.

**శృతి:సర్వ శరీరస్థ చైతన్యం బ్రహ్మప్రాపకో గురు రూపాస్యః** అన్నారు.

అంటే సర్వ దేహముల యందు ఏ చైతన్యము అయితే ఉన్నదో ఆచైతన్యమే నాలో ఉన్నదని ప్రజ్ఞానం బ్రహ్మమని అఖండ గురు స్వరూపమే గురు పదమని చెప్పబడుతున్నది. ఇందు విషయమై గురుగీత యందు కూడా ఇలా సెలవిచ్చినారు...

**||శ్లో||** గురురేకో జగత్సర్వం | బ్రహ్మ విష్ణు శివాత్మకం|
గురోఃపరతరం నాస్తి| తస్మాత్సం పూజయేద్గురుం||

అని చెప్పబడినది, సకల సృష్టికి ఆధారము సృష్టి స్థితి లయ ఆయనె అని మరొక శ్లోకమున చెప్పబడ లేదా. ||శ్లో|| గురుబ్రహ్మ గురువిష్ణు| గురుదేవో మహేష్వరా| గురు సాక్షాత్పర బ్రహ్మతస్మై గురవే నమః||" అని నా గురుని పై గల భక్తి భావమును నీకు చెప్పుచున్నాను బిడ్డ, ఇక నీ మనో భావమును ఏ విధమున నిశ్చలతకు తెచ్చుకుంటావో నిర్ణయించుకొ నీకు శుభము కలుగు గాక, నీకు జన్మసాఫల్యత చేకూరుగాక.

||శిష్యుడు||
**కం.** ఓ గురువర నే విధంబు|
కాగలిగెడి జన్మ మేదొ? కారణమేదో|
ఏగుట వచ్చుట దెల్పుమి|
సాగిల బడి మొక్కుచుంటి సరణిల నీవే||

**తాత్పర్యము:** ఓ గురుదేవ! మరు జన్మమును పొందుట నిజమేనా? దానికి కారణము ఏది? రాకడ పోకడ ఎటువంటిది? మీకు సాష్టాంగముగా నమస్కరించి వేడుచున్నాను.ఇట్టి విషయమై నాకు తెలియజేయుటకు గల దారి మీరైయున్నారు.

**||గురువు||**

**కం.** సకలము నిలలో జీవులు|
అకలము పుణ్యంబులందు నడయాడునిలన్|
ఇక యా కర్మ ఫలంబుల|
వికసించు మరో భవంబు విధమిది గనుమా||

**తాత్పర్యము**: ఈ సృష్టిలో సకల జీవులు పాపపుణ్య కర్మల యందు తిరుగాడుచుండును, అదే జీవునికి గల మహా బంధమైయున్నది. అట్టి కర్మ ఫలంబుల వలన తిరిగి మరో జన్మము ఎత్త వలసి వచ్చును, ఈ విధముగా సకల జీవులు పుట్టుచు గిట్టుచు ఉండును.

**||గురువు||**

**కం.** జీవుడు బహు పుణ్య మరసి|
మావియు గనినాతడేగు మానవ జన్మన్|
కావున ఈ జన్మెందుకొ|
నీ విది గనుగొనుము బాగ నియతము కొరకున్||

**తాత్పర్యము:** జీవుడు చాలా జన్మల నుంచి పుణ్య కర్మ వశమున ఈ మానవ గర్భంబును చేరి, ఇట్టి ఈ పావనమగు మానవ జన్మంబు పొందుచున్నాడు. కావున ఈ జన్మము ఎందుకు వచ్చెనో బాగుగా యోచన జేసి శాశ్వతమునగు జన్మ రాహిత్య పదవిని పొందవలయును.

**||గురువు||**

**కం.**అరయుము ఈ విషయంబును|
ధరలోనిటువంటి జన్మ దుర్లభమంచున్|
తరియించుట కొరకే యిది|
మరి రాదింతటి వివేకమని దెలియుమురా||

**తాత్పర్యము:** ధరలో ఇటువంటి జన్మము (మానవజన్మము) మరల ఈ దేహత్య జానంతరము పొందుట కష్టమని తెలియుము. ఈ జన్మము వచ్చినది తిరిగి జన్మము లేకుండు నట్లు చేసుకొనుటకేనని తెలుసుకొనుము.

**కం.**యీ జన్మ వివేక మిదియు|
ఏ జన్మంబునకు లేదు నీ వది గనుమీ |
రాజితమగు ఈ జన్మయె|
సూచనె మోక్షంబు కంచు సుద్దిది వినుమా||

**తాత్పర్యము:** ఈ మానవ జన్మమునకు ఉన్నటు వంటి వివేకము మరి ఏజన్మమునకు లేదని తెలుసుకొంటిని, ఇంత చక్కటి జన్మము మోక్షము పొందుటకు సూచన చేస్తోంది అనె మాటను నే వింటిని.

**||శిష్యుడు||**

**కం.** మీరే రక్షించ వలయు|
లేరే సకలాది బంధు లేరిల నాకున్|
సారెకు వేడితి మిమ్ముల|
దారే మీరంచు గంటి దాటించుదురే||

**తాత్పర్యము:** ఈ సృష్టిలో నన్ను ఈ భవసాగరము నుండి దాటించు వారలు మీరు తప్ప ఇంకెవ్వరున్నారు. ఈ బంధమును తొలగించే వారు మీరేనని మాటి మాటికి మిమ్ముల వేడుచుంటిని.

**||గురువు||**

**కం.** ధరలోన సకల జీవుల|
పురుషార్థముల నెరుంగు పాడిదె వినరా|
నరుని వివేకము వల్లను|
పరమను మోక్షంబునుండు పదవిని గనరా||

**తాత్పర్యము:** ఈ సృష్టిలో సకల జీవులకు నాలుగు పురుషార్థములు అనే న్యాయము గలదు. కానీ అందులో మానవునకు తన వివేకమును బట్టి పరమ పురుషార్థము ఉన్నది అదే మోక్షము.

<u>చతుర్విధ పురుషార్థములు:</u>

1. ధర్మము,
2. అర్థము,
3. కామము,
4. మోక్షము.

ఇవి పురుషార్థములు అయితే పై మూడు ధర్మార్థ కామములు గలిగిన సకల జీవులతో పాటుగా మోక్షార్థమునగు పురుషార్థము మాత్రమే నరునకు గల జ్ఞానము వల్లనే అని మరోసారి చెప్పవలసి వచ్చుచున్నది. ఎందుకంటే విచారణ చేయువాడు మానవుడే అందువలన, దీనికి **ఆది శంకరులు** చెప్పిన ఈ శృతి వాక్యమును ఒక్కసారి పరికించుము.

||శ్లో||దుర్లభం త్రయమే వైత ద్దేవాను గ్రహ హేతుకం|
మనుష్యత్వం ముముక్షత్వం మహా పురుష సంశయః||

||శ్లో|| వదంతు శాస్త్రాణి యజంతు దేవాన్|
కుర్వంతు కర్మాణి భజంతు దేవతాః|
ఆత్మైక్య బోధేన వినా విముక్తిః|
నసిద్ధ్యతిబ్రహ్మ శతాంత రేయపి||

**తాత్పర్యము**: ఒకడు ఎన్ని శాస్త్ర ప్రసంగములనైనను వివరించవచ్చును. ఎందరు దేవతలను ఉద్దేశించియైనను యజ్ఞ విధుల నాచరింపవచ్చును. ఎన్ని శుభ కర్మములనైనను చేయవచ్చును. కాని వానికి బ్రహ్మము, ఆత్మయు ఒక్కటియేనను జ్ఞానము కలుగనంత వరకు నూర్గురు బ్రహ్మల కాలము గడచినను ముక్తి లభింపదు.

కావున శిష్యా, నీవు ఇట్టి విషయమున ఎటువంటి మార్గమున నుంటివో ఎరిగితివా, అనగా నీ వున్న మార్గము సరియో కాదో నిర్ణయించుకొని గురు వాక్యమునందు బాగా దృష్టి నుంచుము, శుభము కలుగ గలదు. గురువు గారు చెప్పిన మాటలకు ఆతడు పరమ పథానందము పొంది ఇలా అడుగుచున్నాడు.

||శిష్యుడు||

కం. పురుషార్థముల నంటిరి|
నరుడా నాల్గింటి నెట్లు నడయాడవలెన్|
కరుణించి దెల్పు గురువర|
సరణివి నీవంచు గంటి శరణము మీకున్||

**తాత్పర్యము:** గురుదేవ, నాకు మీరే దారియై యున్నారు, మీకు శరణము చేయుచున్నాను. పురుషార్థములనగా చెప్పితిరి, మరి అట్టి విషయముల కరుణించి మాకు దెల్పవలసినది.

## గురువుగారు (వచనము):

బిడ్డా, 84 లక్షల జన్మల యందు తిరిగి ఇట్టి మానవ జన్మ లభించుట యన్నది, ఆయా జీవులు చేసుకొనిన పుణ్యార్జనము వలననే అని తెలియుము. ఈ మానవ జన్మ కడసారిది అని లోకులు బహుగా వాడుదురు. అంటే తిరిగి ఇటువంటి జన్మము దొరకుట దుర్లభము. అందుకే ఈ పురుషార్థములను కేవలం పున్యార్జనకు మాత్రమే ఆచారణకు తీసుకోవలయును, తద్వారా మానవుడు సద్గతి పొందుచున్నాడు.

సద్గతి యనగా జన్మ రాహిత్యము ఎవ్వడేని చిత్ర విచిత్ర నామ శోభితమగు కార్యములు చేసి, యెంతటి పేరు గడించినను ఈ జన్మ లక్ష్యము మాత్రము అది కాదు, కేవలము జన్మ రాహిత్యమే. ఇప్పుడు పురుషార్థముల వివరణ.

**1. ధర్మము:** ధర్మము అనగా న్యాయము. హింసకు లోనుకాకుండా ధర్మాచరణమేనిజమార్గము.ఎటువంటివాడైననుగొప్పగొప్ప పండితులైనను,గురువులైనను,లోకమునుపాలించురాజైననుఇట్టిధర్మాచర (మనసా, వాచా, కర్మణా) న్యాయపూరితమైనజీవితముగడుపుటేధర్మము.

**2. అర్థము**: సంపద (ధనము) ఇది సత్య మార్గము గలవాడవై, సముపార్జన న్యాయ పరమైనదై ఉండవలెను. అంతే కానీ అన్యాయముగా ఇతరుల నుండి ఏదోవిధంగా అపహరించుట చేయకూడదు.

**3. కామము:** కామము అనగా కోరిక, అట్టి కోరిక ఏదైనా ఇతరులది కాని ఏదైనా స్వార్థ చింతనతో త్రికరణ శుద్ధిగా ఉండాలి. కోరిన కోరికకు పరిమితి ఉండవలెను.

**4. మోక్షము:** మోక్షము అనగా విడుదల ఇది లోకులు ఒక విధముగాను జిజ్ఞాసువులు ఒక విధముగాను వాడుకొందురు. ముందుగా లోకుక్లు వారి కష్టములకు తాళలేక అట్టి కష్టములు తీరవలెను.

కాబట్టి దేవాలయములకు వెళ్ళి అచట ఎన్నో విధముల ప్రార్థించినచో మోక్షము కలుగునని పలుకుదురు.

అంటే ఆసంకటము నుండి విడుదల పొందుటే మోక్షము అని లోకుల అభిప్రాయము ఇటువంటి లోకులు **ఆత్మ** జిజ్ఞాస లేనివారు, వీరు జీవిత కాలము తాపత్రయములకు లోనై ఒకనాడు జన్మ రహస్యమును ఎరుగక వ్యర్థముగా మరణించి అథోలోకములు చేరెదరని గరుడ పురాణము చెప్పుచున్నది.

కానీ అత్మ జిజ్ఞాసువులు అయినటు వంటి వారు మోక్షమును జన్మ రహిత్యముగా యెంచుదురు, గురుపాద పద్మముల నాశ్రయించి పొంది భవబంధమును పొగొట్టుకొందురు. అంతే కానీ తుచ్ఛమైన ఈ భోగలాలసకు లోనై కాలము గడుపరు. బిడ్డా, ఈ విధంగ ఆత్మ జ్ఞాన పరుడై ఉండి పురుషార్థములను ధర్మ మార్గమున పయనించువారు ధన్యులు.

||శిష్యుడు||
కం. మరి దెలుపు గురువరేణ్యా|
సరిగా సృష్టందు మూల సరవియు నేదో|
పరిణామ భావ మెయ్యది|
ధరలో మీవంటి వారు దయ గలవారే||

**తాత్పర్యము:** ఓగురువరా, ఈ ధరలో మీ వంటి దయ గలవారు లేరు, అయ్యా సృష్టికి మూలము ఏది అట్టి పరిణామ భావమును తెలుపగలరు.

||గురువు||
**కం.** వినుమా బ్రహ్మంబు నదియు|
కనుమా విశ్వంబటంచు కార్యము దాల్చెన్|
ఘనుడవ్వ దలచి నతడున్|
చనుదెంచు నటంచు వేద చందము వినుమా||

**తాత్పర్యము:** శిష్యా, వినుము ఈ సృష్టికి కారణము బ్రహ్మము, అట్టి బ్రహ్మమే విశ్వముగా పరిణమించి కార్యమను జగత్కారణమైనది. నేను అనేక మయ్యేదననుకొని సృష్టి కార్యము జరుగుటకు బ్రహ్మము కారణమాయెనని వేదము చెప్పుచున్నది.
విశ్లేషణము:సృష్టి పరిణామ దశ షడ్వివిధ వికార పరిణామము చెందినది, అని వ్యాస మహర్షి లిఖిత బ్రహ్మ సూత్రములందు ప్రథమ పాదము రెండవ సూత్రము జన్మాధ్యధికరణమును బట్టి
"||శృతి||జాయతేస్తివి పరిణమితే వర్ధతే క్షీయతే వినష్యతి" అనిఉన్నది.
1. జాయతే - పుట్టుట (గర్భమునందుడుట)
2. అస్థితే - అస్థిత్వముపొందుచున్నది. (అవయవవృద్ధి)
3. పరిణమితే - పరిణామాన్నిపొందుచున్నది.
4. వర్ధతే - పెరుగుచున్నది
5. క్షీయతే - క్షీణిస్తున్నది (వృద్ధాప్యమునొందుట)
6. నష్యతి - నశించుచున్నది.

ఈ విధంగా ఆరు దశలుగా ఉన్నను మూడే చెప్పశఖ్యము అవుచున్నవి.

1. పుట్టుక 2. అస్థిత్వము ఈ రెండు సృష్టి.
2. పరిణామము పొందటం మరియు వర్ధిల్లటం అనునవి స్థితిగానూ.
3. క్షీణించటము మరియు నశించటము అనునవి లయముగాను తెలియవలెను.

ఇక సృష్టికి కారణము బ్రహ్మమని అనేక విధములుగా ఉపనిషద్లు తెలుపుతున్నాయి. పూర్వము ఈ సృష్టి అవ్యక్తమై యుండెను అనగా ఆత్మ యందు అనిగి యుండెను. అది తిరిగి నామ రూపములుగా వ్యక్త మవుచుండును. ఆ సృష్టి కర్తయే సృష్టి యందంతటను ప్రవేశించెను అని బృహదారణ్యకోపనిషద్నందు చెప్పబడెను. దీనినిచాందగ్యోపనిషద్ నందు షష్టోపధ్యాయమునందు "అరుణి" ఉపదేశమునందు ఇలా చెప్పబడినది.

||శృతి||తద్దైక్షత బహుస్యాం ప్రజాయే యేతి తత్తేజో యసృజత|తత్తేజఐక్షత బహుస్యాం ప్రజాయే యేతి తదపోయ సృజత||

ఆ సత్పాదార్థము తనను తాను దర్శించ నెంచినది. అనగా ఈక్షణ చేయదలచినది."నేను అనేకమయ్యెదను అనేకానేక విధములుగా ఉత్పన్నమయ్యెదను" అనుకొని తన నుండి తేజస్సు నుత్పన్నము చేసెను అని చెప్పబడెను.

కావున జగత్కారణము బ్రహ్మమని తెలియవలెను. అదె విధంగా తైత్తిరియోపనిషద్ నందు బ్రహ్మానందవల్లి మొదటి అనువాకమున ఇలా చెప్పబడినది.

||శృతి|| ఆత్మానాకాశ సంభూతః| ఆకాశాద్వాయుః| వాయోరగ్నిః|ఆగ్నేరాపః|ఆద్భ్యపృధ్వి|పృధివ్యాదోషద యః| ఓషధిభ్యోన్నం| అన్నాత్పురుషః||

ఆత్మ నుండి ఆకాశము పుట్టెను, ఆకాశము నుండి వాయువు, వాయువునుండిఅగ్ని,అగ్ని నుండి జలము, జలము నుండి పృధ్వి, పృధ్వి నుండి ఓషదులు(మొక్కలు) దాని నుండి అన్నము ఆ అన్నము నుండి పురుషుడు జనించెను అని ఉన్నది. మన అచల గురు శ్రీ పరశురామ నరసింహ దాసుల వారు భద్రాద్రి రామశతకమున 7 వ పద్యమున తెలిపిన విధంగా అన్నము నుండి సకల జంతు జాలములైనవి అని చెప్పినారు, మరి పైన అన్నము నుండి పురుషుడు అని అన్నారు అని సందేహము కలుగవచ్చు. దీని విషయమై ఏ సందేహము అవసరము లేదు. సృష్టిలో అన్ని జీవరాసుల కన్నను అత్యంత వివేకము కలిగిన జన్మము ఈ మానవ జన్మమే, కాబట్టి ఉపనిషద్వాక్యమునందు పురుషుడు అని ప్రత్యేకముగా వాడినారు. ఇప్పుడు ఈ విషయములను ఇంతగా విచారణ చెయుచున్నది. ఈ దేహ సౌలభ్యము వలననే కదా.

ఇక సృష్టి క్రమమును ఈ విధంగా తెలిపినారు సకల ప్రాణుల నిర్ణయము  అండజ, స్వేదజ, ఉద్భిజ, జరాయుజములని కూడా సృష్టి క్రమమును తెలియవలెను.

1. అండజములనగా - గుడ్డునుండిపుట్టినవి (పక్షులు, సర్పములు, మొదలైనవి). 21లక్ష.

2. స్వేదజములు – చెమట నుండి పుట్టినవి అనగా మురికి నుండి పుట్టునవి అవి (పురుగులు, దోమలు మొదలైనవి] 21 లక్ష.

3. ఉద్భిజములు – భూమి నుండి పుట్టినవి (చెట్లు మొదలగునవి) 21 లక్ష.

4. జరాయుజములు – గర్భము నుండి పుట్టినవి అవి (నర, మృగ, పశువులు, మొదలగునవి) 21 లక్ష.

మొత్తం ఎనుబది నాలుగు లక్షల రకముల జన్మలని చెప్పియుండెను. సృష్టి నిర్ణయమును గురుముఖతా వివరముగా తెలియనగును.

ఆత్మ జ్ఞానము గలిగినంత వరకు నీవు పుణ్య పురుషుడవు కాలేవు. అట్లు గాకున్న భవసాగరమును దాటుకొనలేవు. అయితే ఆత్మ జ్ఞానము కలిగిన తోడనే నీకు జననమరణ భ్రాంతి వీడి పోవుచున్నది అని తెలియుము. గమనిక: ముక్తి అంటే జన్మ రాహిత్యము అని తెలియవలెను అది లభించవలెనన్న, శ్రీ అచల పరిపూర్ణ శివరామధీక్షిత ఆచరణ గురుపాదపద్మములను ఆశ్రయించ వలసిందే.

||శిష్యుడు|| వచనము: గురుదేవా, ఆత్మ జ్ఞానము అనగా నేమి దానికి గల ఉపాయము ఎటువంటిది?

||గురువు|| బిడ్డా, జీవేశ్వరైక్య సంధానము జేసి కేవలం అఖండైక రసానందము గాతన్ను తానెరుగుటే ఆత్మ జ్ఞానము. ఇందుకు, శ్రీ కృష్ణుల వారు భగవద్గీత యందు అర్జునునకు క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము నందు ఇట్లు తెలిపినారు నీవు ఒక   ఇది పరికించుము నాయన:

భగవద్గీత 13వ అధ్యాయము2వశ్లోకము

||శ్లో|| ఇదం శరీరం కౌంతేయ| క్షేత్ర మిత్యభి ధీయతే| ఏతద్యో వేత్తితం ప్రాహు |క్షేత్రజ్ఞ ఇతి తద్విజః|| ఈశరీరమునుక్షేత్రముఅంటారు.ఈశరీరమునుక్షేత్రమని తెలుసుకొనినవాడినిక్షేత్రజ్ఞుడనిఈక్షేత్రక్షేత్రజ్ఞులనెరిగిన వారుచెబుతారు, అన్నాడు.

**గమనిక:** క్షేత్రమును, క్షేత్రజ్ఞుని తెలుసుకున్న వాడే మహా మాయ అదే పునర్జన్మకు బలిష్టమైన భ్రాంతి అని తెలియవలెను. ధీక్షితుల వారి సిద్ధాంతమును బట్టి క్షేత్రము, క్షేత్రజ్ఞుడు వేరు కాదని తెలియవలెను.

||గురువు|| ఇంకనూ నీవడిగినది ఆత్మ జ్ఞానమును పొందుటకు గల ఉపాయము అంటివి, అదే.

"సాధన చతుష్టయ సంపత్తి. భవ బందమును పోగొట్టు కోవలెననే జిజ్ఞాస ఎవరి కుండునో వాడే సాధన సంపదను పొందుటకు అధికారి తద్వార ఆత్మ జ్ఞానము కలిగి ముముక్షువుగా నిలుస్తాడు. ఆ తర్వాత అతని కర్మ పరి పక్వత చేత తదుపరి వాణి ముక్తికి గల మార్గము కాన వస్తుంది. శుద్ధుడాయెనా, అచల గురువును చేరి ఈ భ్రాంతిని పోగొట్టుకుంటాడు.

||శిష్యుడు||జిజ్ఞాస అనగా నేమి స్వామి?

||గురువు|| జిజ్ఞాస అంటే తెలుసుకోవాలి అనే కోరిక. విషయము తెలుసుకొవటానికి చేసె ప్రయత్నము. బ్రహ్మ సూత్రము ప్రథమ పాదము మొదటి అధికరణమున అథాతో "బ్రహ్మ జిజ్ఞాసా" అని తెలిపియున్నారు, సాధన సంపత్తి సిద్ధించిన తరువాత వివేకవంతుడై జనన మరణములు లేని శాశ్వత పథమును వెదుకుతాడు జీవుడు. అంటే జీవుడు మొదట జన్మ సాఫల్యతను పొందాలి అనే చింత శాశ్వతము ఏది అశాశ్వితము ఏది అనే చింతన పరుడై నిత్యమైన దానిని గూర్చి విచారణ చేయుటలోనే క్రమముగా అతనిలో ఈ సాధన సంపత్తి ఏర్పడుతుంది. అప్పుడే ఆత్మ నిష్ఠ కలుగుతుంది.

||శిష్యుడు||

**కం.**సాధన సంపద ఏదో|
సాధనమన నేమి జేయ సాధిత మేదో|
బోధించు మిపుడె గురువర|
బాధనె భవ భయము బాపె భారము నీవే||

**తాత్పర్యము:** గురుదేవా, సాధన సంపద ఏమిటో, సాధనములు ఏమి చేయాలో, దాని వలన సాధితమౌనది ఏది అట్టి బోధను తెలిపినా భవ భయ భ్రాంతి బాపండి స్వామి ఆ భారము మీదే.

**||గురువు||** సాధన సంపద యనునది పూర్వము నీకున్న జిజ్ఞాసయే (జన్మ సాఫల్యతను పొందాలి అనే చింత), ఈ సాధన సంపద పొందుటకు కారణము. తద్వారా మొదట ఈ సృష్టిలో నిత్యము ఏది అనిత్యము ఏది అనే వివేకము అట్టి జిజ్ఞాసువుకు ఏర్పడుతుంది. దానినే నిత్యా, అనిత్య వివేకము అంటారు. ఈ నిత్యా, అనిత్య వివేకము తనలో శాశ్వత వైరాగ్యము కలిగిస్తుంది. ఆ వైరాగ్యము నందు శమ, దమ, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధిని కలిగిస్తుంది. తద్వార అట్టి జిజ్ఞాసువు ముముక్షువై నిలుస్తాడు. ముముక్షువు ఎందుకవుతున్నాడంటే జీవునికి గల తాపత్రయ నివారణకేనని చెప్పక తప్పదు. అయితే ఆ తాపత్రయ నివారణకు మార్గము జన్మ రాహిత్యమే తప్ప వేరొక మార్గము లేదని వేదములు ఘోషించుచున్నవి.

||శిష్యుడు|| తాప త్రయములుఏవి స్వామి?

||గురువు|| 1. ఆధ్యాత్మిక తాపము, 2. అధిదైవిక తాపము, 3. ఆధి భౌతిక తాపము.

**ఆధ్యాత్మిక తాపము**: దేహేంద్రియములకు గలిగిన అధి వ్యాధులు వాత, పైత్య, శ్లేష్మ రోగములు.

**అధిదైవిక తాపము**: ప్రకృతి వైపరీత్యములచే కలిగే దుఃఖములు.

**ఆది భౌతికము**: తన కన్న ఇతరులైన వారి వలన వచ్చిన బాధల వల్ల పరితపించుట. భార్యాపుత్రులు, సర్ప, వృచ్చిక, మొదలైన ఇతర ప్రాణుల చేతను దుఃఖ పడుట. ఈ తాపత్రయములను తొలగించుకొనుటకు చేయు ప్రయత్నమే మోక్షాపేక్ష.

**గమనిక**: మోక్షాపేక్ష కలుగుటే దుర్లభము. అట్లు మోక్షము కోరు ముముక్షువు అచల సద్గురువును చేరితే భవ భ్రాంతి బాపి భవమునకు కారణమైన ఆ నిజ నిర్ణయము జేసి నిన్ను ఈ భ్రాంతి నుండి తరియింపచేస్తాడు.

||గురువు||

**కం.** దేహంబు నేనటంచును|

మోహంబుచె దిరుగు వాడు మూఢుడు వినుమీ|

దేహంబను బంధం బిదె|

ఊహించుటనలవి గాని ఊభియె నదియున్||

**తాత్పర్యము:** ఈ దేహమను బంధము ఊభివంటిది, ఇది అధో ముఖముగా వెనుకటి జన్మల వలే ఈ మానవ దేహ వివేకము గాంచ నీయక తిరిగి అనేకమైన జన్మల యందు తిరుగుటకు మోసము జేయుచున్నది. జీవుడు అనగా దేహము నేనని భ్రాంతి చేత త్రివిధ ధర్మములైన ప్రాణధర్మము, మనో ధర్మము, దేహ ధర్మములకు బద్ధుడై అష్ట మదములందు నిలచి, అష్ట పాశములకు బద్ధుడై వాసన త్రయ, మలత్రయ, ఈషనత్రయ వ్యాధి త్రయములకు లోలుడై యుండు వాడెవ్వడో వాడే మూఢుడు.

విశ్లేషణము: **త్రివిధ ధర్మములు** అనగా.

1. క్షుధ, తృష్ణలు – ప్రాణ ధర్మములు.
2. శోకమోహములు - మనోధర్మములు.
3. జననమరణములు - దేహధర్మములు.

**అష్టమదములు**:

1. ఎక్కువ కులమనుట - కులమదము
2. ఆచారము కలవాడననుట – శీల మదము
3. ధన ద్రవ్యంబులు గలిగి నీల్గుట - ధనమదము.
4. అందముగానున్నానుఅనిదేహమోహమే - రూపమదము.
5. బల వంతుడననుట - యవ్వనమదము.
6. చదువరిని నేను అధిక విధ్య కలవాడననుట విధ్యా మదము.
7. దేశధికారము గలదని విర్రవీగుట - రాజ్యమదము.
8. నిత్యానిత్య వివేక నిస్టా గరిష్టుడనని నీల్గుట - తపోమదము.

**అష్టపాశములు:**

శ్రీ పరశు రామ నరశింహ దాసుల వారు భద్రాద్రి రామ శతకము నందు సెలవిచ్చి నట్టి పద్యము

**సీ.**తల్లి దండ్రులు భార్య తనయులు మిత్రులు| ధనము సహోదరుల్ తనువులైన | అష్టపాశంబులు నమరి బంధములచే|దగిలుండు నరుడు యీ ధరణి యందు| యత్త మామలు బావలల్లుండ్లు కోడండ్లు వదినెలు మరుదులనుచు| తాపత్రయంబుల దగిలి వర్తింపుచు మత్తులై మనుజులు మంద మతిని ||గీ|| సాధుసజ్జనసంగతిసలుపలేక| మోక్షమార్గబెరుగరు మోహ రహిత||రమ్య||

తల్లి, తండ్రి, భార్య, తనయుడు, మిత్రులు, ధనము, సహోదరులు, తనువు మొదలుగా గల వాటికి ఉన్న అను బంధములచే కట్టు బడిన వారు మూఢులు.

**వాసనత్రయములు:**
**సీ.** లోకానుసారియై లౌకిక వృత్తుల వసియించుంటయు లోక వాసనండ్రు|శాస్త్ర పద్ధతి తపో జప క్రతు వ్రతముల వర్తింపుచుండుటయు శాస్త్రవాసనండ్రు| దేహ పోషణ జేసి తీర్థ యాత్రల కెల్ల వడిగ దిరుగుటయు దేహ వాసనండ్రు|నీ మూడు వాసన లిచ్ఛయింపక దేశికుల శేవ జేసి దుర్గుణములణచి|
**||గీ||** తత్వ మస్యాది తాత్పర్య మెరిగి తన్ను దాగన్న పురుషుడద్వైతుడగును||రమ్య||

1. లోకులననుసరించి సకల కార్యముల జేయుటే లోకవాసన.

2. శాస్త్రములననుసరించి చేయు జప, తప, వ్రతాదులు చేయుట శాస్త్రవాసన.

3. దేహ సంరక్షణ చేసి తీర్థ యాత్రల దిరుగుట దేహవాసన.

ఈ మూడు వాసనలను కోరక సద్గురునకు శుశ్రూషలు జేసి దుర్గుణములను వదిలి తత్వ మస్యాది మహా వాక్యాది తాత్పర్యము చేత తన్ను తాను తెలిసిన వాడు అద్వైతుడగును అన్నారు. వీరు తదనుగుణ్యముగా అత్త, మామ, బావ, అల్లుండ్లు, కోడండ్లు, మరదండ్లు, వదినెలు, మరదులని తాపత్రయములదగులుకొని పామరులై బుద్ధి హీనులై పెద్దల సాంగత్యము నెరుగక మోక్ష మార్గము నెరుగరు. మలత్రయములు:

1. **అణవ మలము**: పరమాత్మయనగా ఏదో తెలియక సంశయవృత్తి గల వాడై సంసార వార్ధిలో మునిగి చనుట అణవమలము.
2. **మాయా మలము:** పరుల ద్రవ్యములకై ఆశ పడి పరులకు అపకృతి చేయుట మాయా మలము.
3. **కార్మికమలము**: పుణ్య పాపములచే పుట్టు చావులును ఆశ్రయిచుటయు కార్మిక మలము.

ఈ మూడు మలములను పామరులగు శుద్ధ సంసారులు విడిచి పెట్టక ముక్తి మార్గమును పొందరు.

**ఈషణత్రయములు:**

1. ధారీషణ: ధర్మార్ధ కామములకై భార్యను కోరుట ధారీషణ.
2. సుతులు లేకున్నను గతులు లేవని సుతులను గోరుట పుత్రేషణ.
3. దాన ధర్మముల చేత తరియింతునని ధనమును గోరుట ధనేషణ.

ఈ త్రయ ఈషణముల వలన పుణ్య పాపములను కర్మముల ననుసరించి ఆయా లోకములను పొంద వచ్చును కానీ, ఆత్మైక్య మార్గమును పొంద లేరు.

బిడ్డా! అద్వైత సిద్ధాంత మందు చెప్పబడుచున్నది ఏమంటే... బ్రహ్మమే సత్యము, జగత్తు అసత్యమని. దేహము విడిచి నేను సత్యము అని, దేహముతో గూడినది అసత్యమని పంచ భూత తత్వాత్మికమై వ్యష్టి రూపుడై దేహేంద్రియ సమన్వితమైనది పిండాండమనే ఉపాధిగను, అట్టి ఉపాధిని గూడి పలుకువాడు తన్నుతా మరచి యుండి ప్రాపంచిక వ్యవహారముల యందు దగిలి పై వాసనత్రయములు, మలత్రయములు, ఈషణ త్రయముల వంటి వాటికి లోబడి యుంటాడు, ఈ విధముగా నున్న వాడు అజ్ఞాని యనియు, జీవుడనియు తెలియవలెను. అట్లు గాక పంచ భూతములే బ్రహ్మాండ మను మాయోపాధిగను సమిష్టి రూపుడై మాయను తన ఆధీనములో నుంచుకొను వాడు ఈశ్వరుడనియు తెలియవలెను.

ఒక్క బ్రహ్మమే సృష్టి నిర్మాణమునకు కారణమాయెనని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. అట్టి సుజ్ఞానము ఆవరణము లేకున్నను ఉన్నదని అద్వైత ప్రతిపాదన. ఈ జీవేశులనే జ్ఞానా జ్ఞానములనేటి జ్ఞానము ఒక్కటేనని తెలియుటే మోక్షమని, సుజ్ఞానమని, ఆవరణదోశము పోయినచో నిరాకారుడనని, నిర్గుణుడనని చెపుతారు అంటే ఆవరణము నందే ఉండి పలుకుతాడు. ఇదే అద్వైత నిర్ణయము. ఇది దెలిసిన జన్మ రాహిత్యమని అద్వైత సిద్ధాంతులు పలుకుదురు. ఇందు విషయమయ్యే అచల గురుని చేరవలెనని విన్నవించవలసి వచ్చుచున్నది. నిజ నిర్ణయము, భవ రహిత మార్గము అచల గురు శివ రామదీక్షిత మార్గమే.

**గమనిక**: ఉన్నది ఉన్నట్లు ఉండ జూపు **నిస్వార్ధ గురువు అయినటువంటి మదారిషట్వర్గ రహితుడు**, **పదవీ కాంక్షా లోలురు, డంబాచారకులు కానటువంటి, శిష్యుని పరితాపము మాన్పగల శక్తి గలవారు సిద్ధాంత పరిరక్షకులు, ఎల్లప్పుడూ తనను సర్వులను సమ భావముతో జూచువాడును, శిష్యుని నైపుణ్యతను గ్రహించి బోధచేయువాడును అగు ఆతడే అచల గురుడు అట్టి** అచల గురుని పాద మందక ముక్తి లేదు, అచల గురు మార్గమే నిజ ముక్తి. అచల గురుని ఆశ్రయము తప్ప, ఆయన శరణా గతి తప్ప మరో మార్గము లేదు బిడ్డా, ఇప్పుడు ఇదంతయు నీకు పరిచయ బోధను నిన్ను నీవు విశ్లేషించుకొనుటకు మాత్రమే చెప్పుచున్నాను అని గ్రహించుము.

||గురువు||

**కం.** వేదములు దెలుపు చుండెను|
సాధకము బ్రహ్మ మంచు సత్పురుషునకున్|
మోదంబు చేత వేదము|
శోధించిన వాడు ముక్తి సాధితుడగునూ||

**తాత్పర్యము:** వేదములను తరచి జూచిన సత్పురుషునకు సాధించవలసినది బ్రహ్మ పదమే అని తెలియుము, యెందుకనగా ఏది తెలసితే జనన మరణములు ఉండవో, అది తెలిసినచో తెలిసిన తెలివి ఆ స్థితిని పొందుచున్నవి. అందుచే ఎవ్వడు అట్టి వేదములను మిక్కిలి ప్రేమతో చదివి విచారణ చేస్తాడో, అతడు ముక్తి (జననమరణరాహిత్యమును) పొందుటకు అర్హుడని తెలియవలెను.

**గమనిక**: వేదముల చదివిన పిదప బ్రహ్మము ఇటువంటిది అని నిర్ణయము చేయువాడు, ఎప్పటికి నేనున్నాను అనే భ్రాంతి వీడక అట్టి పరమ పదమును పొంద జాలడు. అట్టి విషయమే విశయముగా, ఉన్నది నాయన అది నిన్ను ఈ భవసాగరము దాటనీయదు. కావున, అచల గురుని చేరి దృష్ట, ద్రాష్టాంతముల రీత్యా గురువాక్య పద్ధతిన గురుముఖతా విచారించి నిజ నిర్ణయము జేసితివేని ఉన్నది, ఉండును బిడ్డా ఇది మరువకు.

||శిష్యుడు||

**కం.** వేదములనగా నేవవి?|
సాధకము బ్రహ్మమెట్లు సాధించవలెన్|
బోధించు ముక్తి పథమును|
వాదము జేయకను విందు వేధయుమీరే||

||గురువు|| వేదములు అవి 1. ఋగ్వేదము, 2. యజుర్వేదము, 3. సామవేదము, 4. అధర్వణ వేదము.

శ్రీ మధ్భాగవతమును చూడగా మొదట వేదము అంతా ఒక్కటిగానే ఉండెనని, వాటిని వ్యాస మహర్షి నాలుగు భాగాలుగా విభజించెనని అవి ఋగ్, యజుర్, సామ, అధర్వణ వేదములుగా విభజించి తన శిష్యులైన పైల, వైశంపాయన, జైమిని, సుమంతులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క వేదాన్ని బోధించారని ఉన్నది. వీటిని విచారించి నేను బ్రహ్మమును, బ్రహ్మమునే నేను అని అనుభవము నొందవలెను. అవాఙ్మానస అగోచర పరబ్రహ్మమును వివరించుటకు వీలు కాక, పూర్వ కాలమున శిష్యులకు బోధపడుటకు గాను మూడు లక్షణములుగా చెప్పియున్నారు, అవి.

1. సత్యం, 2. జ్ఞానం, 3. అనంతం అని.

1. **సత్యము**: అనగా ఏదైతే కాలమునకు లోను కానటువంటిదై తనకు వేరుగా మరొకటి లేక విపరీతము లేనటు వంటిది సత్యము అనబడుతుంది.

2. **జ్ఞానము**: నేనున్నాను అని తెలియబడటం వల్లనే అస్థిత్వం రుజువవుతుంది. ఈ విధంగా రుజువైన ద్రష్ట అనంతముగా చెప్పబడినపుడు అవాంఙ్మానస గోచరమైన ఆ పరబ్రహ్మమును ఎట్లు చెప్పగలము. ఏదైన ఒక వస్తువు యొక్క విషయాన్ని విశద పరచి తెలిపేది జ్ఞానము. జ్ఞానము అంటే జీవేశ్వరైక్య భావమును విచారించి తనను తాను యెరుగుటే జ్ఞానము.  జ్ఞాత, జ్ఞానం, జ్ఞేయము అనే మూడింటిని త్రిపుటి అని అంటాము.అంటే ఈమూడు వేరు కాదనిఈమూడు ఒక్కటేనని సర్వ దృక్కుగా యెరిగినది జ్ఞానము.

3. **అనంతం**: దేశం, కాలం, వస్తువు ఈ మూడింటికి పరిమితము కాకుండా ఉండునదియై సర్వ వ్యాప్తమై యున్నదే బ్రహ్మము అనంతముగా చెప్పబడును. వేదములు మనకు బోధిస్తున్నవి సకల సృష్టికి ఆధారమై తనకు ఏ ఆధారము లేనటు వంటి బ్రహ్మమును అపరోక్షము నొందితే అది మోక్షమని జనన మరణములు లేవని తెలుపుచున్నవి.

భావా భావములనెడి సంశయమే మనస్సు, "మనయేవ మనుష్యాణాం| కారణం బంధ మోక్షయో" ఇట్టి మనస్సే జన్మ హేతువు. ఈ మనస్సే జన్మ రాహిత్యమునకును కారణము. ఈ మనస్సు ఒక్క స్మరణ మాత్రముననే తలంచిన చోటుకు పోవుచున్నది, మనస్సు ఉన్నవి రెండే రెండు యెరుక, మరుపు. ప్రాపంచిక విషయములందు దగిలి దేహమే నేనని సకల కార్యములు చేస్తూ శాశ్వతమును తెలియక పోయెడి అవివేకమే మరుపు. మరొకటి ఈ ప్రాపంచిక విషయములకువేరుగగుర్తెరిగేదిగను, ప్రాపంచిక విషయములపై విరక్తి కలిగి శాశ్వతమును తెలుసుకోవలయును అనే వివేకమే యెరుక. ఈ చంచలమగు మనస్సును నిల్పుటకు గాను అష్టాంగ యోగములు చెప్పినారు. తద్వారా మనో శుద్ధి జరిగి అటు పిమ్మట సాక్షిగ నిలచి స్వ స్వ రూపసాక్షాత్కారము జరిగి జ్ఞానాంగ యోగము నందు చేరుతాడు ఇట్లు అనేక సాధనములు చెప్పినారు. ఇది అంతా నేను బ్రహ్మమును అని నిశ్చలముగా నమ్మియుండుటకు సాధనములు చెప్పినారు. బ్రహ్మమే శాశ్వతమని నిర్ణయము కావున అలా చెప్పినారు. నాల్గు వేదములకు గాను ఆ వేద సారములను నాల్గు మహా వాక్యములుగా తెలిపియున్నారు. అవి అన్నియు గుర్తెరిగే చైతన్యమే బ్రహ్మమని నిర్ధారించినవి. అవిఏవియనగా: ఋగ్వేదము: ప్రజ్ఞానంబ్రహ్మ, యజుర్వేదము: అహంబ్రహ్మోస్మి, సామవేదము: తత్వమసి, అయమాత్మ బ్రహ్మ అని తెలియవలెను.

||శిష్యుడు||

**కం.** యోగంబనగా నేమది|
వేగమెమీ కరుణ జూపి వెతలను దీర్వా|
యోగము లేవేవి గలవొ|
బాగుగ నెరిగించి నాదు బంధము బాపుం||

**తాత్పర్యము:** గురుదేవా! యోగము అనగాయేమి? యోగములు యెన్ని ఏవేవి? నాయందు దయ యుంచి మీ కరుణచే అట్టి విషయంబుల నాకెరింగించి ఈ భవ బంధమనె బాధను తీర్చండి.

||గురువు|| నీవు అడిగినను అడుగకున్నను తప్పక బోధించవలసినవే నాయన వినుము ఈ చెప్పబోవు యోగమును ఆచరణలో పెట్టవలెను. అష్టాంగ యోగముల గురించి వాయు పురాణమున వాయు దేవుని ఋషీష్వరులు అడుగగా వాయు దేవుడు ఇలా సెలవిచ్చినారని మా గురువుగారు బోధించినది, నా స్వానుభవమును, నేను చదివినట్టిది నీకు జెప్పుచుంటిని జాగ్రత్తగా విను. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యాన్నము, సమాధి యనునవి అష్టాంగ యోగములు. అదే విధంగా పతంజలి యోగసూత్రములలో ఇలా వివరించారు.

1. **యమము:** పతంజలి యోగ సూత్రము "అహింసా సత్య మాస్తేయ బ్రహ్మ చర్యా పరిగ్రహా యమాః"||

1. **అహింసా:** సకల జీవుల యందు సమ దృష్టి కలిగి త్రికరణ శుద్ధిగా ఇతర జీవులని హింసించకుండుట.

2. **సత్యం**: మనసుతో గానీ, మాటతో గానీ పాప మంటకుండా సత్య భావన కలిగి యుండటం.

3. **ఆస్తేయము** (దొంగతనముచేయకుండుట): ఏదో రకమున ఇతరుల వస్తు, ధన తది తరములగు వాటిని వారి నుండి అపహరించకుండుట మరియు మానవ జన్మ లక్ష్యము నెరుగక, ఈ మహోత్కృష్టమైన జన్మ విలువను తెలిసి అత్మానాత్మ వివేకము కలిగియుండుటే ఆస్తేయము. ఈలాగున లేక పోయినచో మానవతా ధర్మములో దొంగగా మిగులును.

4. **బ్రహ్మచర్యము**: మనసు బ్రహ్మమునందు చరియింపుచు ఇంద్రియ నిగ్రహము కలిగియుండుట.

5. **అపరిగ్రహము**: దేహముపై మోహము వీడి తత్సంబంధమైన సకల సృష్టి విషయములపై మనసు పోనీయక వాటిని అపరిగ్రహము జేసి కేవలం శాశ్వత పదవిని యగునట్టి బ్రహ్మమును పరిగ్రహించుటే అపరిగ్రహము.

**2. నియమము**: పతంజలి యోగ సూత్రము
శౌచ సంతోష తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానిని యమాః||
a) శౌఛము:ఇది రెండు విధములు:

**బాహ్య శౌఛము**: ఈ కనిపించు దేహమును శుద్ధి గావించుకొనుట.

**అంతః శౌఛము**: మనసు శుద్ధి గావించుకొనుట. కర్మ ఫల త్యాగము వలన మనసు యొక్క సహజ లక్షణమగు కోరిక జనించినను అందు స్వార్ధ చింతన యుండదు, సకల జీవ సుఖములను ఆశించును అదే అంతః శౌఛము.

b)సంతోషం: సాధు సజ్జనుల యందు మిక్కిలి ఈర్ష్యా ద్వేషములు లేక వారి నుండి చెలిమిని కోరి సంతోషముననుండుట.

c) తపము: తపమును గూర్చి శ్రీ భగవానులు భగవద్గీతా సందర్భమున ఇలా సెలవిచ్చారు.

తపము రెండు విధములు 1. త్రికరణ తపస్సులు, 2. త్రిగుణ తపస్సులు.

త్రికరణ తపస్సులు 1. శారీరక తపస్సు, 2. వాచిక తపస్సు, 3. మానసిక తపస్సు.

## త్రికరణ తపస్సులు:

||శ్లో||దేవ ద్విజ గురుప్రాజ్ఞ పూజనం శౌఛ మార్జవం |

బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ముచ్యతే||

**తాత్పర్యం:** దేవతలను, బ్రాహ్మనులను, గురువులను, జ్ఞానులను పూజించుట నిరాడంభరత్వము, బ్రహ్మ చర్యము, అహింసలు అనునవి శారీరక తపస్సులుగా తెలుసుకొనుము.

||శ్లో||అను ద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్|

స్వా ధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ముచ్యతే||

**తాత్పర్యం:** అవేశ ఉద్వేగాలు కలిగించనిది ఇతరులను బాధించనిది, నొప్పించనిది, సత్యము కలది, శ్రేయస్సుని ఇచ్చేది, అలాగే వేదాధ్యయనము, పరమాత్మ నామ జపములు అనునవి వాక్కుకి సంబందించిన తపస్సులు వాచిక తపస్సు.

||శ్లో|| మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మ వినిగ్రహః|

భావ సంశుద్ధిరిత్యేత తపో మానస ముచ్యతే||

**తాత్పర్యం:** ప్రశాంతమైన మనస్సు, అవేశ ఉద్వేగాలు లేని శాంత స్వభావము, మౌనము, హృదయ శుద్ధి, ఆత్మ నిగ్రహమువంటివి మానసిక తపస్సులుగా గ్రహించు.

త్రిగుణతపస్సులు:

1. సాత్వికతపస్సు, 2. రాజసతపస్సు, 3. తామసతపస్సు.

||శ్లో||శ్రద్ధయా పరయా తప్తం తపస్త త్రివిధం నరైః|
అఫలాకాంక్షి బిర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే||

**తాత్పర్యం**: ఫలములు కోరుకోకుండా నిశ్చల స్థిరచిత్తంతో, శ్రద్ధతో చేయబడే శారీరిక, వాక్కు, మనస్సు సంబందిత తపస్సులను సాత్విక తపస్సులంటారు.

||శ్లో||సత్కార మానస పూజార్థం తపో దంబేన చైవ యత్|
క్రియతే తదిహప్రోక్తం రాజసం చలమధ్రువం|

**తాత్పర్యం**: కాగా ప్రతి ఫలం ఆశించీ, గౌరవాది పూజలు అందుకొనుటకూ, వ్యధ చెందుతూ చేసే తపస్సూ, దానమూ రాజస తపస్సని గ్రహించవలెను.

||శ్లో|| మూఢ గ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే
తపః | పర స్యోత్సాదనార్థం వా తత్తామస
ముదాహృతం||

**తాత్పర్యం**: మొండీ, మూర్ఖపు పట్టుదలతో, తనకి బాధ కలిగించుకుంటూ, ఇతరులకి హాని చేస్తూ చేసే తపస్సు తామస తపస్సు.

**స్వాధ్యాయము (జపము):** స్వాధ్యాయము అనగా నిగంటు దర్శనమున మూడు విధముల అర్ధము చెప్పుచున్నది అవి వేదాధ్యయనము, వేదము, జపము. ఇక్కడ శిష్యునకు బోధించునపుడు జపము విషయమునే చెప్పవలసి వచ్చును. కావున జపమనగా మంత్రమును మననము చేయుటే జపము. ఈ జపమును గూర్చి కూడ వాయు దేవుడు ఒక సందర్భమున శౌనకాది మునులకు వివరించినారు జపముమూడు విధంబులు అవి.

a) వాచక జపము: మంత్రమును చుట్టూ ఉన్న వాళ్ళకి వినబడేలాగున మననము చేసేది వాచక జపము.

b) ఉపాంశు జపము: పెదాలు మాత్రమే కదుపుతూ శబ్దం ఎవరికీ వినబడకుండా తన చెవుల వరకే వినబడేలాగ చేసేది ఉపాంశు జపము.

c) మానస జపము: ఎవరికీ ఏమీ వినబడదు పెదవులు కదలవు, అసలు జపం చేసే క్రియ బహిర్గతము కాకుండా చేసె మనో ధ్యాసయే మానస జపము. ఈ మూడు జపములలోనూ మానస జపమే ఉత్తమము, ఉపాంశము మధ్యమము, వాచకము సామాన్యము.

d) ఈశ్వరపూజనం: గురు పుత్రుడైనటువంటి వాడు గురువు మీద విశ్వాసము నుంచి అదే ఇతరులు ఏదేని ఒకఇష్ట దేవతను నమ్మి ఇతరులు ఏమనుకొందురో ఏమొ అని ఎట్టి సందేహము, సిగ్గులేక ఆరాధించటం.

3. **ఆసనము**: ఆసనములు మొత్తం 84 విధములు అందులో అత్యంత ప్రాముఖ్యమైనవి యోగ సాధనకు భగవద్సేవకు నిర్ణయ మొందినవి నాలుగు (4) అవి. సిద్ధాసనం, పద్మాసనం, సింహాసనం, గోముఖాసనం.

4. **ప్రాణాయామము**: ఇందులోని క్రియలు మూడు విధములు అవి 1. పూరకము, 2. రేచకము, 3. కుంభకము.

పూరకము: శ్వాసను లోనికి తీసుకునే క్రియే పూరకము.

రేచకము: శ్వాసను బయటికి వదిలే క్రియ రేచకము. సహజంగా జరిగేది ఉచ్ఛ్వాస నిశ్వాసలు అట్టి సహజ క్రియను ప్రయత్న పూర్వకంగా ఒక పద్ధతిలో జరిపే క్రియనే పూరక రేచకములు అంటారు.

కుంభకము: ఇది రెండు విధములు 1. అంతః కుంభకం. 2. బాహ్య కుంభకం.

అంతః కుంభకం: పూరించిన శ్వాసను లోన కొంతసేపు లోన నిలిపి యుంచటం అంతః కుంభకము.

బాహ్యకుంభకం: రేచించిన శ్వాసను కొంత సేపు బయటే నిలపడం.

5. **ప్రత్యాహారము**: జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలను స్వాధీనంలో ఉంచడమే ప్రత్యాహారము.

6. **ధారణ**: ఇది ఒక వస్తువు పై తదేకంగా దృష్టిని నిల్పుటకు చేసే ప్రక్రియ ధారణ.

7. **ధ్యానం**: భ్రూమధ్యమున మనసు, దృష్టి నిలిపి అంతర్ముఖుడైయుండుట.

8. **సమాధి**: సర్వం మరిచిపోయి తనలో తాను ఐక్యం కావడమే 'సమాధి'. ఈ స్థితిలో బాహ్య ప్రపంచంతో, అంతర్ ప్రపంచంతో సంబంధం లేని సమత్వ స్థితి సాధించగలుగుతారు.

బిడ్డా! జ్ఞానాంగ యోగములు **తేజో బిందూపనిషత్ నందు వాక్య ము రీతిగా ఇలా చెప్పబడినది .**

||శృతి|| యామోహి నియమస్త్యాగో | మౌనం దేశశ్చ కాలతః| ఆసనం మూల బంధం చ | దేహ సామ్యంచ దృక్ స్థితిహ్| ప్రాణ సంయమనం చైవ| ప్రత్యాహారచ్చ ధారణా| ఆత్మ ద్యాన్నం సమాధిశ్చ ప్రోక్తాన్యంగానివై క్రమాత్|| **అనెడి తేజో బిందూపనిషత్ నందు వాక్య రీతిగా యమ నియమ త్యాగ మౌన దేశ కాల ఆసన మూలబంధ దేహసామ్య దృక్ స్థితి ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ఆత్మ ధ్యాన్న సమాధి అను నీ పదునైదున్ను జ్ఞాన యోగాంగములు అనబడును.**

1. **యమము**: పంచభూతములు, దేహేంద్రియంతఃకరణ ప్రాణాదులున్ను ఈ చరాచర జగత్తు సర్వమున్ను పరబ్రహ్మమే గాని, ఆ పరబ్రహ్మమునకు వేరుగా లేదనియుకే, కాబట్టి అట్టి పరబ్రహ్మమే తాననియు సదా భావించుటే యమమనబడును.

2. **నియమము:** జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు వాటికవి ఆయా పనులను చేయుచున్నను వర్ణాశ్రమములకు దగినట్లుగా ప్రవర్తించుచున్నను ఏ కార్యములను చేయక సాక్షిమాత్రరుణిగా ఉన్నాను. ఆత్మ స్వరూపుడగు నేను కుల గోత్ర జాతి గుణ రూప నామ క్రియలు లేనివాడును. పరబ్రహ్మ స్వరూపుడను అని సదా భావించుటే నియమమనబడును.

3. **త్యాగము:** దేహేంద్రియాది జగత్తు సర్వమును మిథ్య అని ఎరింగి వాటియందలి భ్రాంతిని విడిచి పెట్టి సదా ఆత్మాని సంధానము చేయుచుండుటే త్యాగమనబడును., కానీ బ్రహ్మ జ్ఞానము లేక వృధాగా భార్యా బిడ్డలు గృహము మొదలయిన వాటిని విడిచి పెట్టి తిరుగుట త్యాగము గాజాలదు.

4. **మౌనము:** అవాంగ్మానస గోచరమగు పరబ్రహ్మయే తానని దెలిసి, సదా మాట్లాడక, ఒక వేళ మాట్లాడినను నా వాగీంద్రియమే మాట్లాడుచున్నది కానీ సాక్షి స్వరూపుడగు నేను మాట్లాడ లేదని భావించుచూ సకల తలంపులు నశించి ఆత్మానుభూతియందుండుటే తూష్ణీం భావ స్థితి

మరియు ఏది వాక్కు చేతను మనస్సు చేతను ఇట్టి దట్టిదని చెప్పుటకును భావించుటకును శక్యము గానిదో, శబ్ద రహితమైనదో, ప్రపంచ రహితమయినదో, అట్టి పరబ్రహ్మయే తానని సదా తన్మయంబు కేవల జ్ఞప్తి మాత్రముగా నుండు స్థితియే జ్ఞానమౌనమనబడును. ఆత్మ జ్ఞానము లేక వృథాగా నోటితో మాట్లాడ కుండుట అనునది జ్ఞానికి మౌనముగా చెప్పబడలేదు.

5. **దేశము**: ఏది ఆది మధ్యాంతములు లేనిదో, దేనియందు మనస్సు ఇంద్రియములు ప్రాణ వాయువు సంచారము మాని లయించి యుండునో, మరియు దేనియందు రాగ ద్వేష కామ క్రోధాది వృత్తులన్నియు సూన్యమై, దుఃఖము కొంచెమైనను తోచకుండునో, ఏది నిరతిశయ సుఖ స్వరూపముగా నుండునో, ఏది నిత్య నిర్మలమైనదో అట్టి బ్రహ్మమే దేశమనబడును అదియే నిజముగా ఏకాంతము అనబడును. అంతే గాని నిర్జన ప్రదేశమునందుండుట చిత్త నిశ్చలమును గాజాలదు.

6. **కాలము**: భూత భవిష్యత్తు వర్తమానంబులనెడి త్రికాలంబులు దేనివలన కల్పింపబడెనో, ఏది త్రికాలంబులందును నాశము లేక వెలుగుచుండునో దేనియందు కాల నియమంబులు లేకుండునో, ఏది అనాదియో, ఆ బ్రహ్మమే కాలమనబడును.

అట్టి పరబ్రహ్మ మనెడి కాలము తానని తద్రూపముగా నుండు బ్రహ్మ జ్ఞాని ప్రపంచ సృష్టికి లోబడిన భూత భవిష్యత్తు వర్తమానములనెడి త్రికాలములనున్ను మహాప్రళయ కాలమునున్ను మీరిన వాడై స్వయం ప్రకాశకుడై బ్రహ్మ స్వరూపుడై ప్రకాశించుచుండును.

**7. జ్ఞానఆసనము**: కాయ క్లేశము, అలసట, జాడ్యము, నిద్ర, ఆయాసము, మొదలైనవి ఏ బ్రహ్మ నిష్ఠ యందు తోచకుండునో ఆ బ్రహ్మ స్వరూపాను భూతియే సుఖాసనమనబడును. అభ్యాస మందు చెప్పబడిన పద్మాసన, కూర్మాసన, వీరాసన కపాలాసన, సిద్ధాసనాదులు, జ్ఞానసనంబులు కాజాలవు మరియు ఏది పొందితే పొందదగిన మరేదీ ఉండదో అది నిజాసనము.

**8.మూలబంధనం**: ఏది ఈ చరాచర జగత్తుకు కారణమైనదో, ఏది సకల బంధములను నాశనము చేయునో దేన్ని యెరిగిన తక్షణమే మాయా బంధము తనకు తానే నశించి పోవునో అదియే పరబ్రహ్మమనియు మూల బంధ మనియు చెప్పబడును.

**9.దేహ సామ్యము**: సముద్రమునందు జేరినట్టి నదులు ఆ సముద్ర రూపమైనట్లు, చిద్రూపమగు పరబ్రహ్మ మందు సకలేంద్రియ వృత్తులున్న లయించి సమభావమున నొందుటే దేహ సామ్యమనబడును.

**10. దృక్ స్థితి:** చూపును జ్ఞానమయముగా జేసి, అట్టి జ్ఞానమయమైన చూపు చేత ఈ చరాచర జగత్తు సర్వమున్నూ బ్రహ్మ స్వరూపముగా చూడవలయును. అట్టి జ్ఞానమయమైన చూపే శ్రేష్ఠమైనది, అంతేగాని నాసికాగ్రమును మరియు భ్రూమధ్యమును చూచుచుండునట్టి చూపు శ్రేష్టమైనది గాజాలదు. మరియు ఆకాశాది పంచభూతములను సర్వకాలదేశములును దేహేంద్రియాది ప్రాణ మనోబుద్ధి చిత్త అహంకారములను విద్య విద్యలను సకల ప్రపంచమున్ను దృశ్యములనబడును.

ఈ దృశ్యములను అన్నింటిని ఏ శుద్ధ తెలివి ఎరుగుచున్నదో ఆ శుద్ధ తెలివియే పరమదృక్కు అనియు, ఆత్మ అనియు బ్రహ్మమనియు చెప్పబడును. అట్టి శుద్ధ తెలివి యందు దృష్టి నిలుపు వారే జ్ఞానులు అనబడుదురు.

**11. జ్ఞాన ప్రాణాయామము:** నానా విధ రూప నామములు గల భూషణములు అన్నియు బంగారు కంటెను వేరుగా లేనట్లు, దేహేంద్రియ ప్రాణమనోబుద్ధి చిత్త అహంకారాది ప్రపంచము సర్వమున్ను, బ్రహ్మము కంటెను వేరుగా లేనందున సర్వమున్నూ చిన్మాత్ర స్వరూపమగు బ్రహ్మముగానెరిగి, ఆ బ్రహ్మము తానుగా భావించి తదాకారముగాయుండిన ప్రాణ వాయువు,

అంతః కరణము, దాని సంబంధమగు సకల వృత్తులు తమకు తామే ఆత్మ స్వరూపుడగు తనయందు లయించిపోవును. ఆ విధంగా సకల వృత్తులున్ను తనయందు లయించుటే ప్రాణాయామమనబడును.

- రేచకము: రూప నామ క్రియలన్నియును అసత్యమనియు, మాయకార్యములనియు తెలిసి, అవి తానుగానని తెలిసి వాటి యందలి భ్రాంతిని విడచిపెట్టుట.
- పూరకము: ఆత్మ స్వరూపుడగు తాను నామ రూప క్రియలు లేని బ్రహ్మమని భావించుట.
- కుంభకము: అట్లు ఆత్మ స్వరూపుడై తాను బ్రహ్మమను ధ్యాన్నమున్ను విడిచిపెట్టి సకల సంకల్పములు నశించి కేవలప్రజ్ఞాన మాత్రుడుగా బ్రహ్మ స్వరూపుడుగానే యుండుట ఇట్టి జ్ఞానరేచక, పూరక, కుంభకములనెడి ఈ జ్ఞాన ప్రాణాయామమునే బ్రహ్మ జ్ఞానులు సదా అభ్యాసము చేయుదురు అని తెలియవలెను అజ్ఞానుల రీతిగా ముక్కును బట్టి పీడించుట జ్ఞానులు చేయరు.

**12.జ్ఞానప్రత్యాహారము:** నిత్యా నిత్యములగు చేతన అచేతనములు సర్వమున్ను సచ్చిదానంద పరబ్రహ్మముగా భావించుటే ప్రత్యాహార మనబడును.

**13. ధారణ:** మనస్సు దేని దేని యందు వ్యాపించునో, ఆ వస్తువులన్నిటిని నుండి వీడి పరబ్రహ్మమున నిల్పుటే ధారణయనబడును.

**14. ఆత్మ ధ్యానము:** దృశ్యములను ఎరిగేది దృక్ రూపమే నేననుటే ఆత్మ ధ్యానము అనబడును.

**15. సమాధి:** ఆత్మ స్వరూపుడగు నేనే బ్రహ్మమనెడి ధ్యానమున్ను మరచి, తాను వృత్తి శూన్యుడై ఎల్లప్పుడూ నిర్గుణ నిరాకార చిన్మాత్రముగానుండుట సహజ నిర్వాణ సమాధియనబడును.

బిడ్డా, ఈ పదిహేను అంగములను ఎల్లప్పుడూ అభ్యాసము చేయువాడు జ్ఞాన యోగి అనబడును.

# 1. గురు కీర్తన

గురు మహరాజ గురూ జైజై। పరబ్రహ్మ సద్గురు జైజై।

1. బంధ విమోచన కారణ జైజై।అంధకార భవ నాశనజైజై।
అగనిత గుణ గన దేవా జైజై।జగదీశ్వర గురు నాథా జైజై
|| గురు||

2. స్వస్వరూప ప్రత్యక్షమ జైజై।స్వస్వ స్వరూపక నిజ గురు జైజై।
సాధు జనావన పోశక జైజై।శోధిత పథ నిర్దేశక జైజై ||గురు||

3. భావ భావమా వర్జిత జైజై। కేవలాత్మ నిజ నిర్ణయ జైజై।
నిర్భయానంద నిజ గురు జైజై।నిర్మోహన బుచ్చయార్య జైజై
||గురు||

4. సద్గురోత్తమా దేవా జైజై।మద్గురు జగతయ్యార్యాజైజై।
భవము బాపు సద్గూరు జైజై।అవనిలో చాటెద నిజ పథమని జై
||గురు||

5. అశరీరా గురు పదములు జైజై। ఆశపాశ వినాశక జైజై।
దయగలసద్గురు దేవా జైజై। ధర నిజానంద పదములు జైజై
||గురు||

6. సద్గురోత్తముల పదములు జైజై।సధ్గతి కొరకై వేడెద జైజై।
సంతతసమున ఈ మార్గము జైజై।సంతోషాఖ్యుడుదెలిపెను జైజై
||గురు||

## 2. తత్వము

1. ఇది మంచి తరుణాము ఇటురా ఓమనసా|
కదలు సద్గురు జేరి విరమించావే మనసా || ఇది||

2. ఎన్నీ జన్మములైన విసుగు జెందవే మనసా|
మున్నూజన్మము లేనీ బాట దెలియవే మనసా||ఇది||

3. ఆవేశించుమి గురుని సన్నిధికీ ఓమనసా|
సేవా జేసియూ భవ భ్రాంతి బాపుకో మనసా ||ఇది||

4. గురునీ చేరిన నీకు శుభకరమే ఓమనసా|
కరునించిభవమానేకలబాపునే మనసా || ఇది||

5. అక్కడిక్కడ బోకు ఏవగింతురే మనసా|
చక్కాగా గురుసేవె నిక్కు దెలియవే మనసా ||ఇది||

6. భావా భావము నీవు భవము నీవే మనసా|
భవ బంధముల బాపు గురు తారకుడే మనసా||ఇది||

7. శివరామ ధీక్షితుల బాటిది దెలియవే మనసా|
భవనాశస్థితిలేనిపద్ధాతిఇదేమనసా ||ఇది||

8. అశరీర నిజ గురు చరణంబులే మనసా|
ఆశ పాశంబుల ద్రోసి వేయునె మనసా| ||ఇది||

9. నిజానందుని బోధ నిక్కంబు ఓమనసా|
నిజమెరిగి సంతోషదాసు బలికిరే మనసా ||ఇది||

## 3. తత్వము

1. భవ సాగరమును దాటుటకై గురు పదములె గతియని నమ్ముమురా|
అవనిలో శ్రీ శివరామదీక్షితుల మార్గమె నిజమని దలచుమురా
||భవ||

2. రానిదిపోనిదివున్నదిబయలనికానిదిలేనిదియెరుకదిరా|
లేనిది వుందనె భ్రాంతి ఇదేనని యెరిగి మానుటే నిజమదిరా
||భవ||

3. యోగము యాగము లెన్ని జేసినా సాగక దాటని భ్రాంతదిర|
వేగమె నేననె భ్రాంతిని దాటగ అచల గురుపద మొందుమురా
||భవ||

4. దేహమునందునబహిరంతరములద్వంద్వరూపుడనకాదదిరా|
దేహి దేహిమనె గుర్తెరిగెది లేదది ఏమనరానిది యుందదిరా
||భవ||

5. క్షేత్రక్షేత్రమనేపాత్రదోశముకుసాక్షిగనుండుటగాదదిరా|
సూత్రముగాకే పాత్రముగాకను అంతటయున్నదె నిజమనరా||భవ||

6. మూలము లేనీ జ్ఞానశరీరం బేమి లేదు నిజ మినుమదిరా|
చాలగ విను మేల్కల రహితంబనె సద్గురు బోదిదె వినుమికరా ||భవ||

7. ధరలో సద్గురు జగతయ్యార్యుల పదములు నమ్మిన ధన్యమెరా|
మురయుచు శ్రీ సదా కరుణానందులు సంతోషాఖ్యుని బ్రోచెనురా
||భవ||

## 4.తత్వము

1. మనసా విను నామాట |నివు| మునుగతి దెలసుకొ బాటా|
వినక కనక నీకేమి హితంబిక సన్నుతి జేసియు గురుపద మందుకొ
**||మనసా||**
2. నిజపథమును గనుమంటి |నివు| గజిబిజి మానుకొ మంటీ|
నిజపథ మిది శివరామధీక్షితుల|సుజన పోశ సద్భాట ఇదేయని
**||మనసా||**
3. విషయానందము గనుచు |నివు| విషదము దెలియవు నెపుడు|
విషయలోల నివు గురు కటాక్షమున మృషయని దెలసి నీ నిజస్థితి
దెలసుకొ **||మనసా||**
4. తరుణము వచ్చెను గదవే |మరు| జన్మము మానుట మేలే|
తరుణము వచ్చెను తరియించుటకై|అరుసుడచల గురు పదముల
వాలవే**||మనసా||**
5. లక్ష్యా లక్ష్యము లేక |ఏ| లక్షణ మేమియు గాకా|
లక్ష్యా లక్ష్యము లేవి గాకను| లక్షణయుతులకు చెంతన నున్నది
**||మనసా||**
6. సర్వము నేనన గాదు |మరి| సర్వజ్ఞుండన రాదూ|
సర్వగతంబది ఏమనరానిది|సార్వకాలము ఏకమైయున్నది
**||మనసా||**
7. శబ్ధమువచ్చుటగాదు|అది| నిశ్శబ్ధంబనరాదు|
శబ్ధాశబ్ధంబనిపరివిధముల| లబ్ధిగాకను దోశ రహితమది**||మనసా||**

8. ధర లింగంపల్లీ పురము |నిజ| గురుపథ భావమె స్థిరము|
సరిగల బోధిది సాటిల లేదని| గురుగని సంతోషాఖ్యుడు బలికెను
**||మనసా||**

# 5.తత్వము

1. గురువరా భవరహితమగు యాదారి యేదయ గురువరా|
ధరను శ్రీ శివరామధీక్షిత బాటయే ఇది శిష్యుడా ||గురువరా||

2. ఏమి నియమము ఏమి నిష్టయు ఏమి విధమది గురువరా|
నీమ నిష్టలు లేని బాటిది నామ రూపము లేదురా ||గురువరా||

3. నామ రూపము లేని దానిని యేమనందురు గురువరా|
నామరూపములేనిదేదో బట్టబయలదిశిష్యుడా ||గురువరా||

4. బట్ట బయలని పేరు యెవ్వరు పుట్టి చెప్పిరి గురువరా|
పుట్టిగిట్టేయెరుకయే మరివట్టిద్రై పలికిందిరా ||గురువరా||

5. యెరుక బట్టా బయలు రెంటిలో సత్యమెయ్యది గురువరా|
యెరుక యెన్నడు పుట్టలేనిది ఉన్నవనుటె భ్రాంతిరా ||గురువరా||

6. అట్టి బట్టా బయలును నేనెట్టు లెరుగను గురువరా
గట్టిగా నే లేను లేనని గురుని కరుణచె దెలియరా ||గురువరా||

7. ఏమి జేతురొ ఏమనందురొ భవము బాపుమి గురువరా|
కామితము లేనట్టి షోడశి మంత్ర మిదుగో శిష్యుడా ||గురువరా||

8. మిక్కుటము జగతయ్యార్యుల పరమ భక్తుండెవ్వరో|
చక్కగను సంతోష దాసుడు మదిలో దలచెను శిష్యుడా||గురువరా||

# 6. తత్వ్యము

1. ఏదయా గురు చరణముకు సాటి| యెందెందు వెదకిన
లేదయా ఈ బోధ సరిపాటి|వాదములు ప్రతి వాదములు ఏ భేధ వాదము
లేవి గాకను|మోదముగ |శివరామధీక్షిత బాట నమ్మిన పావనుల సరి
||**యేదయా**||

2. సకల మత సమ్మతము వినరండీ| భవ రహితమగు ఈ బోధ వడసిన
చాలు చాలండీ|నఖముఖంబుల నేమి లేదని పలుకు పలికిన పలుకె
లేదని|నిక్కమగు యా అచల గురువరు పథము నమ్మిన|జన్మ ధన్యము
||**యేదయా**||

3. నేను తానావరణమును బాసీ|నే నేననే ద్వయ దోశమును లే లేదనే
దెలసీ|నేను నేననెదేది లేదని లేక పోయిన దంచనుట లేదని |
ఉన్నదెప్పుడు ఉండు నిజమని అన్నదె ఏపాటి లేదని ||**యేదయా**||

4. వేద తీతము దెలియవలెనండీ పరిఖించి బాగుగ మోదముగ సద్గురుని
జేరండీ|బోధ జేసియు భవము బాపెడి గురుని వాక్యమె నిక్కమనుచును|
వేద వార్తికమంతమగు యాబోధ దెలిపెడి ఘనుడికన్నను ||**యేదయా**||

5. మూల మించుక లేని దెరుకండి| ఆవరణ మీడిన లేని దుందనె భ్రాంతి
వదలండి|మూలమూ లే నెరుకనేయని అచల గురుని పథము|
దెలసియు| చాలగా పరిపూర్ణ మందున మారు బలుకునె
యేమిలేనిది ||**యేదయా**||

6. ధరణి లింగంపల్లి పురవాస శ్రీ నిజానంద పరమ పావన
జగతయాచార్యా| యురము నందున మీదు పదములు నమ్మి
నిల్పితి|కరుణతో సంతోషాఖ్యుని భవము నణచగ ప్రేమ జూపుమి
||**యేదయా**||

## 7. తత్వము

1. అందాదు అచలబోధన్నా| ఆ| నందా యోగులకన్నా అలవిగాదన్నా
అందీ పొందిన అచల గురుని పదముల గనక|శరణు పొందని
వారికందాదు అచలాము || **అందాదు**||

2.ఏమానరానిది బయలు| నిజము |నీమ నిష్టలు లేక
సేవించదగును| కామితార్థులకు ఏ ఇతర సేవితులైన| స్వామీ
భవ రహిత అండా జేరకయున్న ||**అందాదు**||

3. ఎప్పాటి కొకవిధామన్నా|బయలు|అప్పుడిప్పుడు మారే
విధము గాదన్నా| తప్పుడు బోధాలు జెప్పి గురి దప్పించే|
ముప్పు గలిగించేదీ మూఢా మతులనుగన్నా ||**అందాదు**||

4. నామా రూపము లేనిదన్నా| బయలు | కామితార్థముగాని
దన్నా| పామర జనులాకు ద్వయ దోశ సహితులకు|ప్రేమాతో
గురుపదములందానివారికి ||**అందాదు**||

8. ఆది అంత్యము లేనీ బయలు | సర్వా| బేధా వాదా రహితా
నిత్యా నిర్గుణము|సాధు సత్పురుషూలా సేవా జేయని వారు|
బాధా గురువుల జేరీ యేదారీ గానారు ||**అందాదు**||

9. ధరలో లింగంపల్లిపురము| గురుడు | వర జగతయ్యార్యుల
పదము| మురయుచు సంతోషదాసుడు బట్టీన|భవ రహిత
నిజ బోధ నిందా జేసిన వారి ||**అందాదు**||

## 8.తత్వము

1. పోదము పదవే అచల సద్గురుని పదములు నమ్మిక ఓమనసా|
ఆదరి లేని జన్మ మేల ఇక వాదన మానుకొ ఓమనసా
**||పోదము||**

2. జననమరణ మను భవ సాగరమును దాటుట లక్ష్యము ఓమనసా|
ఘనముగా నీ యెడ కర్మ బాపు గురు చరణము నమ్మికొ ఓమనసా
**||పోదము||**

3. రానిది పోనిది ఉన్నదేదొ మరి బాగుగ దెలియవె ఓమనసా|
కానక పొయ్యెవు ఉన్నది గన్నచొ కన్నది లేదెరుగో మనసా
**||పోదము||**

4. వినునది కనునది అనునది లేదని నిజమది యెరుగవె ఓమనసా|
కనుగొని సద్గురు వాక్యము తరచియు లేనినే ననుఓమనసా
**||పోదము||**

5. రాక పోకడల సంగతెరుంగని బట్టబయలది ఓమనసా|
చేకొను శ్రీ గురు షోడశి మంత్రములేని జన్మమిది ఓమనసా
**||పోదము||**

6. ధరణి లింగంపల్లి పరమ గురువరుని పాద పద్మములె ఓమనసా|
యురమున జగతయ్యార్యులు గొలచియు సంతోషునిగనె ఓమనసా
**||పోదము||**

## 9.తత్వము

1. జన్మ మానుకోర|మానవ జన్మ లక్ష్యమదెరా| జన్మలలో కెల్ల ఉత్కృష్ట జన్మము| చిన్మయదేహ వినాశ పథంబిది **||జన్మమానుకోర||**

2. పురుషార్థములెరుగు| పరమా పురుషార్థము నెరుగూ|
పురుషార్థములవి జీవ ధర్మములు|పరమ పురుషుడన
నిజమోక్షంబది|| **||జన్మమానుకోర||**

3. వ్యర్థము జేయకురా |జన్మము అర్థము దెలియుమురా|
సార్థకమై మరు జన్మము బాపుకొ|ఆర్తితొ సద్గురు చరణమె శరణనీ
**||జన్మమానుకోర||**

4. గురుని జేరుకోరా సద్గురు అచల పథము గనరా|
గురుని జేరి ఈ భవ రహితంబను| మేల్కను దెలసి నీ కర్మము బాపుకొ
**||జన్మమానుకోర||**

5. మానవ జన్మమురా మరల కానవు నిజమదిరా|
కానక సకలము నాది నాది యని| గానము జేయుచు గతి గానవు విని
**||జన్మమానుకోర||**

6. పరమ గురువరునీ పదములె చరమము జన్మమనీ|
సరిగని జగతయ్యార్యులు నమ్మిన| పరమ పథంబును సంతోషుడుగనే
**||జన్మమానుకోర||**

## 10.తత్వము

1. యెంత జెప్పిన మనస వినుకోవుగా|అంతు|లేనట్టి భవ బంధమిది యేనుగా|చింత గలిగియు నీవు చెంత జేరిన గురుడు సంతసంబుగ బోధనందించుగా ||యెంత||

2. మోదంబుతో గురుని వేడావలె|మనస| సాధకంబగు బోధనందా వలే| బాధలన్నియు బాపి భవ బంధమణచెడి|మేదిని శివరామధీక్షితంబిది యని ||యెంత||

3. నాల్గుసేవలు బాగజెయ్యావలె|గురుని|కీలు దెలియుట కొరకు వేడావలె| నాదబిందు కళలనటనయే నీవని| చాలాగ గురుధ్యాన్న నిష్ట నుండా వలె ||యెంత||

4. గురుసేవజేసినా దొరకూ గదే|మరల|తిరిగి రానీబాట దెల్పూగదే| గురు కటాక్షంబుతో గురుగోప్య మెరిగియు పరిపూర్ణ స్థితినీకు దక్కూగదే ||యెంత||

5. సగుణ బ్రహ్మం బాని యంటావులే|తిరిగి|నిర్గుణా స్థితి యంచు పలికేవులే|సగుణ నిర్గుణములు సదసత్తులును నీవె సొగసైన గుర్తెరిగె దేహంబువే ||యెంత||

6. తాపత్రయంబుల దిరుగాడకే|మనస|పాప-పుణ్యము కర్మ దును మాడవే|తేప తేపకు గురుని నామ స్మరణము జేసి ఓపికతొ కరుణించుమని వేడవే ||యెంత||

7. షొడశీ గురు మంత్ర బోధాయెనె|మనస| ఏడ ఏమియు లేని జాడాయెనె| వాడ వాడల నిండి నేను నీవని లేక| వేడ ఏమనరాక బయలాయెనె ||యెంత||

8. ధరణి లింగంపల్లి బాటందవే|గురుని|కరుణామృతా వీక్షణం బందవే|కరుణించి భవ బంధ బాధలే దొలగించ|ధీరుడై సంతోషదాసు బల్కిరిదే ||యెంత||

## 11.తత్వము

1. శ్రీధర శివరామదీక్షితులు| శ్రిత జన పోశక దినకరులు|
ఈధర తారక ప్రభువరులూ|బాధనె భవ బంధ నాశకులు
||**శ్రీధర**||

2. భువిని నల్గొండ శ్రీ నారాయణ పురం| భవ రహిత నిర్దేశ సుర ధామము| భువనాది భవ రహిత బోధనకై|శివరామ ధీక్షిత అవతారము ||**శ్రీధర**||

3. సుందరులు సుజనుల బాంధవులు| చింతలు బాపిన సురవరులూ| నందకమా ప్రభుని గురు మంత్రము|సందేహ నాశమె సత్పథము ||**శ్రీధర**||

4. అలనాటి ఆ ప్రభుని ఆ చింతయే|మలినంబనె ద్వయము దునుమాడెనే|కలలోన గను గొన్న గజము మేల్కొని చూడ|కల మేల్కల రహితమందించెనూ ||**శ్రీధర**||

5. పరమ గురులు బుచ్చయార్యులనే|చరణము నమ్మిన మద్గురువులు|ధరణి లింగంపల్లి జగతయ్య చరణము| యురమున నమ్మియు సంతోషుడూగనే ||**శ్రీధర**||

## 12.తత్వము

1. శేషశయనుడై సృష్టి రచననే చేకొనె పోషకుడితడేనా |
దోష రహితమౌ నిజ గురు బోధను దాసుల కొసగినదితడేనా

**||శేష||**

2. చీమ మొదలు యా బ్రహ్మ మందున సమముగ నిండినదితడేనా|
ధామము చిన్మయ పరమాత్ముడునై సాక్షీమాత్రుండితడేనా

**||శేష||**

3. హరిహర బ్రహ్మల మూల పదంబై గురుడై నిలచినడితడేనా|
గురుపద మెన్నగ మూలము లేదని ఉన్నది గనుమనెదితడేనా

**||శేష||**

4. రాజరాజ మహరాజ వైభవంబుత్తదియన్నది ఇతడేనా|
గజముకు సింహా స్వప్నము వలెనిది గజిబిజి లేదనడితడేనా

**||శేష||**

5. మన్నన జేయగ షోడశి మంత్రము మననము కొరకై యొసగినడా|
సున్నిల సర్వంబేమి లేదు యని యన్నది లేదనెదితడేనా

**||శేష||**

6. ధరణి లింగంపల్లి జగతయార్యుల పదములె నిజమని నమ్మినడా|
నిరతము సంతోషాఖ్యుడు ద్వాదశి భావమునందున నిలచినడా|

**||శేష||**

## 13.తత్వము

1. మూడు రోజుల ముచ్చట |ఏ ముద్దు మురిపెము లేదటా|
పాడు దేహం అశాశ్వతంబది మూడు దినముల ఆటటా
**||మూడు||**

2. మలము మూత్రము కొంపట |ఇది నమ్మితే బహు చేటటా|
వలపు కాడవు గాకనెప్పుడు ఇలను బూటకమిదియటా
**||మూడు||**

3. అష్ట మదముల నెలవటా|ఇది కష్ట సుఖముల కాంక్షటా|
నిష్టతో నిజ గురుని జేరియు ధురితముల కడ ద్రోయుటా
**||మూడు||**

4. ఉత్తదిల సర్వంబటా|యా సత్తు చిత్తులు సమమటా|
సత్తు చిత్తుల సంగ తెరిగిన| మత్తు వదలుట నిజమటా
**||మూడు||.**

5. అటు ఇటా ఇక ఇటు అటా|యే|అటటటయనె బాటటా|
అటయటాయని కథను పోలినకలయనేఈ భ్రాంతట
**||మూడు||**

6. సద్గురుని చరణమ్మిటా ఇల మద్గురు జగతయ్యటా|
సద్గతిని వెదుకంగ సంతోషాఖ్యుడన్నను నేనటా **||మూడు||**

## 14.తత్వము

1. వేదా తీతమె పరమార్థం|సందేహము మానుట పరమపదం |
సాధు సజ్జనుల సాంగత్యంబున|బోధను దెలయుటె శుభకరము
**||వేదా||**

2. గురుని జేరుటే సత్పథమూ| తద్దురితము బాయుటె ముక్తిపథం|
హరిహర బ్రహ్మల మూలము గురుడని|మురయుచు
తను గనుటానందం **||వేదా||**

3. తానని పలుకుట తత్వార్థం|బది|లేనని పలుకుట మోక్షార్థం|
తానే నేనని నేనే తానని అనుభవ రహితమె నిజమార్గం
**||వేదా||**

4. అచల గురుని పద వాక్యార్థం బిల|ఇచ్చలేనిదది నిజమార్గం|
సుచరితమౌ శివరామధీక్షితుల సచ్చరితంబే భవ రహితం
**||వేదా||**

5. సరణిదె శ్రీ నిజ గురు చరణం బిల| సర్వ జనుల కానందమయం|
ధరణి లింగంపల్లె పురములొ |సద్గురు| సేవలొ సంతోషులానందం
**||వేదా||**

## 15. తత్వము

1. మూలము లేనిది వినర| గుర్తెరిగె దేహమిది కలరా|
కీలిదె గురువరు మంత్ర వాక్యముచె ఏమి లేని నేనుత్తది గనుమిక
**||మూలము||**

2. యెరిగిన సర్వంబంతా|అది| యెరుక దేహమనే చింతా|
నిలువదు ఈ యెరుకెన్నడు బయలున| లీలలు జేసియు
యేగుననుట కలె **||మూలము||**

3. కలనే జగమని వినరా| నే మొదలే కల్లని యనరా|
మూలము లేనిది మాయశరీరము| కల మేల్కల వలె ఏమిలేనిది
**||మూలము||**

4. శివరామ ధీక్షితుల పథము|భవ బంధము బాపును నిజమూ|
ఇలలో సరియగు మార్గంబిది విను|సలలితముగ సద్గురుని నమ్మిక
**||మూలము||**

5. అవని లింగంపల్లి పురము|శ్రీ జగతయ్యార్యుల పథము|
భవము బాపు విను నిజగురు వాక్యము |సంతోషాఖ్యుడు బలికెను
సత్యము **||మూలము||**

## 16. తత్వము

1. ఏమనందూ భవ బంధ మోక్ష భ్రాంతి నాశము ఏమనందూ|
రామడుగు శ్రీ శివరామ భావము ఏమనందూ ||**ఏమనందూ**||

2. అందు ఇందన రాక యెన్నడు సంధు లేకను నిండి యూహకు|
అందరానీ భావమును నేనెందు లేకను తెల్పవలె మరి
||**ఏమనందూ**||

3. యెరిగె దేహమె భ్రాంతి ఇది యని|గురుని కరుణచె యెరుక కల్లని|
యెరుక యుందని, యెరుగ కుందని ఏమి యెరుగక నున్న
బయలును ||**ఏమనందూ**||

4. షోడశీ గురు వాక్యమును మహ పంచదశి భావమున నిలిపిన|
ఏడ ఏమియు లేని నేనని భ్రాంతి బాసితిననెడి భావము
||**ఏమనందూ**||

5. కాంచగా యెరుకేగి బయలును యెరుగ తన ఉనికేమి లేదని
పంచ గుణములు లేని బయలున పలుకు బలుకుట నలవిగానిది
||**ఏమనందూ**||

6. ద్వంద్వ రహితమె నిజ పథంబని భవము బాపెటి విమల బోదిది|
ద్వాదశీ భావంబు గురునిచె బాగుగా స్థిరమయ్యె భావము
||**ఏమనందూ**||

7. మద్గురులు జగతయ్య చరణము నమ్మి వేడితి భవము బాపగ|
సద్గతి నేననగ భ్రాంతియు సత్యమిదె సంతోష వినుమనె
||**ఏమనందూ**||

## 17.తత్వము

1. గురుని జేరవలెరా నిజ గురు గోప్యము గనవలెరా|
గురుని జేరి సత్పథము గనుచు భవ|బంధ రహితమౌ నిజ బోధను
గొను **||గురుని||**

2. దాసుడు గావలెరా సద్గుణ సాధుల గనవలెరా|
దాస దాసులకు దాసుడవగుచును దోసి లొగ్గి గురువాసము జేరుము
**||గురుని||**

3. శోధన జేయుమురా నిజ పథ మెక్కడో దెలియుమురా|
వేద శా్స్త్ర నిగమాగమ మెల్లను బోధించును నీజన్మ లక్ష్యమును
**||గురుని||**

4. మరల రాదు వినరా మానవ జన్మ దుర్లభమురా|
సరగున సద్గురు పద కమలములను బట్టిన మరియే జన్మ లేదు ఇక
**||గురుని||**

5. పరమ గురువరునీ తత్కృప చరమము జన్మమనీ|
యురమున మద్గురు జగతయార్యులు నమ్మి స్మరించిన నిజ గురు
వాక్యము **||గురుని||**

## 18.తత్వము

1. వార్తికాంతమ గోచరంబది – సార్థకము గురు సన్నిధి|
   ఆర్తులగు భవ రహిత భక్తుల – పూర్తి చరమము నిజమది **||వార్తి||**

2. అది ఇదీ యనరానిది – ఆనంద మేమియు గానిదీ|
   అది ఇదీ యది ఇది యదెయనే – బేధమేమియు లేనిదీ **||వార్తి||**

3. అగణితంబై యున్నది మరి – యోగ మెన్నడు గానిదీ|
   సగుణ నిర్గుణ నిర్విశేషము – సంగతేమి యులేనిది **||వార్తి||**

4. పుట్టు గిట్టులు లేనిది యది – మొట్ట మొదలన రానిదీ|
   దిట్టముగ గురు కరుణ చేతను – బట్టబయలై యున్నది **||వార్తి||**

5. షోడశీ గురు మంత్ర మొందిన – వీడు ద్వయ దోశమ్మదీ|
   ఆడ ఈడన రాక యెన్నడు – వేడ ఏమియులేనిదీ **||వార్తి||**

6. నామ రూపము లేనిది |ఏ |నీమ నిష్టల నెరుగదీ|
   స్వామి సద్గురు పదము జేరని సోమరుల కందానిదీ **||వార్తి||**

7. అంతులేనీ గురుని సేవను పంతమున చేకొనెనిది|
   సంతసంబున దాసదాసుడు సంతోషాఖ్యుడు గనెనిది **||వార్తి||**

## ***19.తత్వము***

1. మరల మానవ జన్మ తిరిగి రాదిక నీవు సద్గురుని జేరవే మనసా| యెరిగె దేహము సకల బాంధవుల్నార్జితము కల్లనీ దెలియవే మనసా| **||మరల||**

2. లేనిపోనీ బంధ భ్రాంతిలో బడి నీవు మునుగు చుండుట మాను మనసా|జనన మరణములనే వ్యథ మాపుకొనుట యే నిజ లక్ష్య మెరుగవే మనసా| **|| మరల||**

3. ద్వయ దోశముల మూల మద్వైతమన్నను బంధంబు దెగదుగా మనసా|ద్వయ దోశ నాశనంబైనా మీద ఎరుక ఏమిలేదని దెలియు మనసా| **||మరల||**

4. స్థిత ప్రజ్ఞతన్నది సాధనలు జేసితే సాధితంబవదేది మనసా| స్థితి గుదురు మార్గంబు గురు వాక్యమున నుండు బాగుగా యెరుగవే మనసా| **||మరల||**

5. దేహంబుపై మోహ ముండుటచె సకలంబు నాది నాదంటావె మనసా|మోహంబుచే యెరిగె దేహమును గురుమంత్ర ఖడ్గముచె ఖండించు మనసా| **||మరల||**

6. అశరీర నిజగురు పాద పద్మములందు జేరి నిలువుము నీవు మనసా| దశదిశల వెదకియా గురుకరుణ బడసి నీ జన్మంబు బాపుకో మనసా| **||మరల||**

7. ధరణి లింగంపల్లి గురు చరణ తీర్థంబు గైకొనగవలెనిది మనసా| మురయుచును జగతయ్యార్య పదములు బట్టి సంతోషుడూ గనెనె మనసా| **||మరల||**

## 20.తత్త్వము

1. చింత వదలుట కొరకు సద్గురు|చెంత జేరవలెనయా|
మంతనంబున చింతనే భవ భ్రాంతి బాపును గురుడయా ||చింత||

2. అష్ట మదముల చేత జన్మము | దుష్ట పరచకురన్నయా|
నిష్టతో సద్గురుని భావము దృష్టి నిలుపవలెనయా| ||చింత||

3. ధన మధాందము చేత నీవును | ఘనుడ నేనంచనకయా|
తను మనః ప్రాణములు గురునకు ధార బోయావలెనయా ||చింత||

4. పరుల చింత వలదయా నిజ | గురుని చింతనె మేలయా|
సరిగ నేనను పాధి ద్వయముల |వీడుటే భవహర మయా ||చింత||

5. వాదబేధము విడచి సద్గురు | బోధనెరుగావలెనయా|
మోదమున ఈజననమరణము బాధ మానుట నిజమయా|||చింత||

6. షొడశిని చేపట్టి తదుపరి | పంచదశిచే వీడయా|
జాడలేని యెరుక మృపయని|ద్వాదశాక్షరి బూనయా| ||చింత||

7. ధరణి శ్రీ శివరామధీక్షిత | బాట నమ్మిన చాలయా|
పరమ మార్గము గనియు నెప్పుడు తిరిగి రారిక వినరయా| ||చింత||

8. నిజానందులు జగతయార్యుల | పరమభక్తుని గనరయా|
రాజరాజులు అచలయోగుల | దాసుడగు సంతోషయా| ||చింత||

## 21. తత్వము

1. రంధి బాపు గురు పాదపద్మముల చేరినిలువవలెరా (2)
 ద్వంద్వ రహితమౌ నిజగురువాక్యము అందీ పొందవలెరా **||రంధి||**

2. తారకాసన సాంఖ్యమనస్కము యోగము భ్రాంతులురా |(2)
 అశరీర గురుపథమె స్థిరమది సర్వా భ్రాంతిరహితమౌరా **||రంధి||**

3. వేద శాస్త్ర ఇతిహాసములన్నీ యెన్నరానివవిర |(2)
 మోదముగా గురు అచల భావమున వాదరహితమౌరా **||రంధి||**

4. ఉన్న బయలున లేనిది ఎప్పుడు లేనే లేదనరా |(2)
 మన్ననతో శివరామ భావమే భవము బాపు వినరా | **||రంధి||**

5. చిల్లర గురువుల జేరి నిలచినా జన్మమె వ్యర్థమురా|(2)
 కల్ల మాయనే యెరిగె శరీరము ఉత్తది వినుమనెరా | **||రంధి||**

6. మద్గురు శ్రీ జగతయ్య చరణమే సద్గతి జూపెనురా (2)]
 సద్గురు వాఖ్యమె భవము బాపునని సంతోష దాసుడనెరా **||రంధి||**

## 22. తత్వము

1. ధన్యులచల గురు చరణము నమ్మిన భక్తుని సాటిల లేదు గదా|
అన్యమైన ఈ సకల ప్రపంచము సద్గురు పాదా క్రాంతమురా|
**||ధన్యుల||**

2. సకల దేవతలు అఖిల ప్రపంచము భూత సృష్టిలో భాగమురా|
సకల విశ్వమాతీతుడు గురుడని నిజము దెలిసిన ఘనుడుగదా
**||ధన్యుల||**

3. గురుడను పదమే పరమాత్ముండని మురయుచు మదిలో నిలుపుసదా|
సురులు నరులు మొదలాది గణంబుల మూలము గురుడని
దెలియుమురా **||ధన్యుల||**

4. గురుడు శిష్యునకేక భావమున ఆనందం బెరిగించె గదా|
తిరిగీ తత్పదమానందంబుకు మూలములేదని దేల్చె గదా
**||ధన్యుల||**

5. కలలో బోగము మేల్కతొ బాసిన విధముగ నిజ మేల్కాయె గదా|
మూలములేనీనేననుభావముబాసిబోవుటానిజముగదా
**||ధన్యుల||**

6. మద్గురు జగతయ్యార్యుల పదములు మురయుచు ధ్యాన్నించెసదా|
సద్గురు వాక్యమె సత్పథంబనీ సంతోషాఖ్యుడు దెల్పెగదా
**||ధన్యుల||**

# 23. మంగళహారతి

1. శ్రీకరంబైనట్టి ఓంకార పీఠమున|ప్రాకటంబుగ హరికి భానునకును|
ఏకముగ వెలిగేటి యాజ్ఞవల్కికి మరియు జోకతో రాజఋషి జనక పతికీ
**|| జయమంగళం ||**

2. శుద్ధ తత్వజ్ఞుడౌ శుకయోగికిని నిత్య సద్ధర్మ మార్గుడౌ సాందిపునకు
సిద్ధముగ పూర్ణుడౌ శ్రీకృష్ణ మూర్తికిని|ఒద్దికతో అర్జునా యుద్ధవులకు
**|| జయమంగళం||**

3. శ్రీ మించి వెలిగేటి శ్రీధర స్వామికిని|ధీమించు శివరామ ధీక్షితులకు
కామితార్థమునిచ్చు ఘన అప్ప బ్రహ్మముకు వేమారు శ్రీ సీతరాములకును
**|| జయమంగళం||**

4. పరిపూర్ణబోధను ప్రకట పరచిన యట్టి వర భాగవత కృష్ణ
గురునకిపుడు|   నిరతంబు పరతత్వ మెరిగించు ఫీల్ఖాన| వర లక్ష్మణ
ప్రభూ చరణములకు **||జయ మంగళం ||**

5. స్థిరమైన ఓంకార గురుపరంపర యందు| పరిపూర్ణ సిద్ధాంత
భావములను|నిరతంబు భక్తులకు కరుణించి బోధించు గురుడు కొండోజు
సీతయ్యార్యులకును **||జయమంగళం||**

6. బాగుగ సీతయార్యుల పథము| యాగమిది భవ రహిత బోధ యంచు|
జాగరూకత నొంది నిజ మార్గమెరిగినా| నాగులా రామలింగార్యులకును|
**|| జయ మంగళం ||**

7. నాగుల రామలింగార్య చరణము బట్టి| యోగియై బృహద్వాశిష్ట
మొంది| వేగిరము గురుభక్త భవ బంధ మణచినా రాగ రహితా
బుచ్చయార్యులకును **||జయమంగళం ||**

8. నిజగురు నిర్భయానంద బుచ్చయార్య| రాజ రాజులు అచల
యోగులనుచు|  రాజితంబగు బోధ నిజ బాట జూపినా| నిజనంద
జగతయ్యార్యులకును **||జయ మంగళం||**

9. సురులు జగతయ్యార్య పదములు చేపట్టి| ధీరులగు అచల సాధులను గనుచు| నిరతంబు పరిపూర్ణ భావమును బోధించు| కరుణానంద సంతోషునకును| **||జయమంగళం||**

10. మీకు మూలము లేక మాకు మూలము గాక లోక లోకములెల్ల యేకముగను|ప్రాకటంబై యున్న పరిపూర్ణ బ్రహ్మమును| జోకతో దెలుపు గురు పీఠమునకు **||జయమంగళం||**

*****

## 24. మంగళహారతి

1. బంధ మోక్షా భ్రాంతి నాశక స్వామికీ మంగాలమానరే|
వందనము శివరామదీక్షిత బాట దెలిపిన స్వామికీ ||బంధ||

2. పంచాక్షరీ భావమును నీవెంచి చూడు మన్నడే|
యెంచి జూచిన భక్తులకు యే కొరత లేదని యన్నడే ||బంధ||

3. జ్ఞాన మార్గము జూపు పెద్దల అండ జేరుమన్నడే|
జ్ఞాన జ్ఞానము రెంటిలో గల జ్ఞేయ మెరుగూమన్నడే ||బంధ||

4. పాదుగను ఆధారమున ఫణి చాలనం బెరుగన్నడే|
వేద మూలం బేదొ నీ నిజ స్థానమది విను మన్నడే ||బంధ||

5. సగుణ నిర్గుణ బేధముల యా సంగ తెరుగు మన్నడే|
సగుణ నిర్గుణ రహితమగు నిజబోధ దెలియు మన్నడే ||బంధ||

6. సాధితంబగు నిజ పథంబిది ఉన్నదెరుగు మన్నడే|
మోదముగ విను యెరిగె దేహము యేమి లెదని అన్నడే ||బంధ||

7. ధరణి లింగంపల్లి సద్గురు దేశికుని నమ్మన్నడే|
తిరిగి వచ్చుటకేమి లేదనె బాట సంతోషుడు గనే ||బంధ||




శ్రీ లలితాంబా సమేత సమిష్టి బోధానంద ఉప్పలంచి కృష్ణమూర్తి షోడశీ విలక్షణ స్వామి వారి స్వగృహము నందు  అచల సిద్ధాంత దృష్ట ద్రాష్టాంత నిజ నిర్ణయ ప్రబోధ గైకొనినటువంటి తరుణము తేదీ: 28.06.2018.

## గ్రంథ ముద్రణకు సహకరించిన శిష్యులు

## బేగంపేట్ గ్రామం (పెద్దపల్లి జిల్లా)

1. ||అ.ప|| పరికి పండ్ల గణపతి జ్యోతి దంపతులు.

2. ||అ.ప|| పిడుగు భద్రయ్య లక్ష్మమ్మ దంపతులు.

3. ||అ.ప|| బల బద్దుల అక్కెమ్మ.

## గ్రంథ ముద్రణకు సహకరించిన దాతలు

1. ||అ.ప|| కమండల సత్యనారాయణ మాధవి గౌడ్ దంపతులు (శేరిలింగంపల్లి).

2. ||అ.ప|| పొనగంటి రవికిరణ్ శ్రావణి దంపతులు (యాకుత్ పురా,హైదరాబాద్).

3. ||అ.ప|| బొడ్డుగారి నాగరాజు గారు (పఠాన్ చెరు).

4. ||అ.ప|| దొంతుల ఓం ప్రకాష్ ఉమాదేవి దంపతులు (కొత్త గూడెం) ఖమ్మం.